


సంపుటి: 4   సంచిక: 6   పుటలు: 68   విడి ప్రతి వెల: 30 రూ.   అక్టోబర్ 2018



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2018-2020

**స్ఫూర్తి :** యు. సుబ్బరాజు

**సంపాదకులు:** నారాయణ శర్మ

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

అడవి రాముడు : 9491870753

రాధా స్కూల్ (అనంతపురం) లో చదివే పిల్లలు

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

బి. అశోక్: 9963571510

కె. మల్లికార్జున: 9000453887




# విషయ సూచిక





ముఖచిత్రం: (అ)సామాన్యుడు

చిత్రకారుడు: శివరాం ప్రసాద్

**కొత్తపల్లి 101 వ పుస్తకం!**




---

యా సాధూంశ్చ ఖలాన్ కరోతి విదుషో మూర్ఖాన్ హితాన్ ద్వేషిణ:
ప్రత్యక్షం కురుతే పరోక్షమమృతం హలాహలం తత్క్షణాత్ ।
తామారాధయ సత్క్రియాం భగవతీం భోక్తుం ఫలం వాంఛితం
హే సాధో వ్యసనైర్గుణేషు విపులేష్వాస్థాం వృథా మా కృథా:॥

సంస్కృత మూలం
(భర్తృహరి)

తెలుగు అనుసరణ
(ఏనుగు లక్ష్మణ కవి)

ఖలునిన్ సజ్జనుగాగ, మూర్ఖజను సంఖ్యావంతునింగాగ, రా
యలసన్మిత్రులగా; నగోచరము బ్రత్యక్షంబుగా, బ్రాణ హృత్
కలనంబై మహ విష బమృతముగా జేయు సత్కర్మము
జ్జ్వల నిష్ఠా నిధి వై భజియింపుము వయస్యా , వాంఛితార్థప్తికిన్

భావం: మిత్రమా! దుర్మార్గుడిని కూడా మంచివాడిగా, మొద్దుని కూడా తెలివైనవానిగా, రాజులని కూడా మంచి స్నేహితులుగా, కనబడని దాన్ని కనిపించేట్లుగా, ఘోరమైన విషాన్ని కూడా అమృతంలాగా చేస్తుంది "మంచిపని". అట్లాంటి మంచి పనిని గట్టి పట్టుదలతో చేయాలి.

# ఏ డ్రస్ వేసుకోవాలి, ఇవాళ్ల?

చిన్న మోహన్‌దాస్‌కి సూటూ బూటూ అంటే చాలా ఇష్టం. పోరుబందర్ మహారాజా వారికి దివానుగా ఉండేవాడు వాళ్ళ నాన్న. పెద్ద ఉద్యోగం; బ్రిటిష్ వారితో పరిచయాలు. ఐతే ఇంట్లో మోహన్‌దాస్ వాళ్లమ్మ పుత్లీబాయి మటుకు శ్రోత్రియురాలు. భక్తిపరురాలు. ఆమెనుండి మోహన్‌దాస్‌కి 'మామూలుగా' బ్రతకటం కొంచెం కొంచెం అలవాటైంది.



పెద్దయ్యాక మోహన్‌దాస్ లండన్ కు వెళ్ళాడు. ఆ రోజుల్లో కూడా లండన్ అంటే కేవలం డబ్బున్న వాళ్లకే. మరి మోహన్ వాళ్ల ఆ సరికి రిటైర్ అయిపోయాడు, చనిపోయాడు కూడా. ఇంట్లో డబ్బుల కొరత ఏమీ లేదు అంతగా. అయినా పొదుపుగా లేకపోతే డబ్బులు చాలకొస్తాయి.

లండన్ అంటే, అందులోనూ లాయర్ చదువంటే, మరి సూటూ బూటూ కావాలి. దర్జా రావాలి. చక్కని మీసకట్టు పెట్టుకున్న స్టైలు మోహన్ ఆ నియమాలని బాగా పాటించాడు. 'కోటూ, ప్యాంటూ, లోపల బుషర్టూ, మెడలో టై'! చదువైపోయాక, ఇంటికొచ్చాక, అన్ననుండి వత్తిడి- 'ఉద్యోగం చెయ్యి. డబ్బులు సంపాదించు' అని.

మోహన్‌దాస్ లాయర్ అయితే అయ్యాడు కానీ అనుభవం లేదు. అనుభవం ఉంటే గానీ పని దొరకదు. చివరికి అతి కష్టం మీద దక్షిణఆఫ్రికాలో లాయర్ పని ఒకటి దొరికింది. అక్కడి భారతీయ వ్యాపారులకు న్యాయ సలహాలనివ్వటం.

సూటూ బూటుకి మరలా పని పడింది. డబ్బులు కూడా బానే ఆడాయి చేతిలో. కుటుంబం

అంతా దక్షిణాఫ్రికా చేరుకున్నది.

అయితే అక్కడ మోహన్‌కు వివక్ష అంటే ఏంటో అర్థమైంది. డబ్బులు ఉంటై. అయినా తెల్లవాళ్ళు మనవాళ్లని చిన్నచూపు చూస్తారు. తమతో కలవనివ్వరు, కూర్చోనివ్వరు, తిననినివ్వరు, కలిసి ప్రయాణంచేయనివ్వరు, ఓటు హక్కు కూడా ఇవ్వరు.



మోహన్‌దాస్ కు ఆవేశం వొచ్చింది. గొడవ మొదలెట్టాడు. బాగా తిరిగాడు. మాట్లాడాడు, రాసాడు. "సహనాన్ని కోల్పోకుండా నిరంతరంగా డిమాండ్ చెయ్యాలి. మనలో సత్యం ఉంటే ఎవరైనా దిగి రావలసిందే" అని నమ్మాడు, అందరికీ చెప్పి ఒప్పించాడు. పెద్ద పెద్ద గొడవలయ్యాయి. పోలీసులు, జైళ్ళు.. చివరికి దక్షిణాఫ్రికా ప్రభుత్వం దిగి వచ్చింది. అక్కడి భారతీయులకు ఓటు హక్కు లభించింది.

అప్పటివరకూ ఇంకా సూటూ బూటూ అంటే మోజే, మోహన్‌దాస్ కు.

దక్షిణాఫ్రికాలో విజయం సాధించే సరికి మన దేశంలో స్వాతంత్ర్య పోరాటం చేస్తున్న గోపాల కృష్ణ గోఖలే, తిలక్ వంటి నాయకులు అతన్ని మనదేశం రమ్మన్నారు. "ఇక్కడి బానిసత్వం పోగొట్టాలి" అన్నాడు. సూటూ వేసుకొని వచ్చిన మోహన్‌దాస్‌కు "ముందు మనదేశం అంతా బాగా తిరిగి చూడాలి. అన్ని ప్రాంతాలనూ చూసి, ఇక్కడి మనుషుల్లో కలిసిపోయి గమనించాలి. వీళ్ల మనసుల్లో ఏమేమి ఉన్నాయో చూడాలి" అనిపించింది.

దానికోసం రైల్లో జనరల్ బోగీ ప్రయాణం ఎంచుకున్నాడు. తను ఇప్పుడు 'అనామకంగా తిరుగుతాడు-అన్నీ గమనిస్తాడు-అందరితో మాట్లాడతాడు.." అలా సూటూబూటూవిడిచేసి, గుజరాత్‌లో సాధారణ ప్రజలు వేసుకునే కుర్తా, ధోతి, తలపాగాలోకి మారాడు.

ఆ ప్రయాణాల్లో మోహన్ దాస్ "గాంధీజీ" అయ్యేందుకు పునాది దొరికింది. అతనికి అప్పుడే

'భారతదేశపు ఆత్మ' లభించిందని చెబుతారు.



అతనికి అర్థమైంది- "మన దేశం వస్త్రాలకు ప్రపంచ వ్యాప్తంగా పేరెన్నిక గన్న దేశం! ప్రత్తిపంట బాగా పండుతుంది, మన దగ్గర! అన్ని ఊళ్లలోను, అన్ని కుటుంబాలు నూలు వడికి దారాలు తీస్తాయి! ఊరూరా చక్కని వస్త్రాలు నేస్తారు మనవాళ్ళు. స్వతంత్రంగా బ్రతుకుతారు. కుటుంబ పరిశ్రమలు ఆయా కుటుంబాలకు ప్రాణాధారాలు. మన ఆర్థిక వ్యవస్థకు అవి మూల స్తంభాలు! బ్రిటిష్ వారు వచ్చి బట్టల ఫ్యాక్టరీలు పెట్టారు. యంత్రాలతో మిల్లు బట్టని ఉత్పత్తి చేసి చవకగా మన మీదికి వదిలారు; మనం కూడా ఎగబడి వాటిని కొన్నాం. ఇటు మన వేతగాళ్ల కడుపు కొట్టాం! ఇదే పనిని మనం అన్ని వృత్తులతోటీ చేసాం! వృత్తికారులందరినీ దెబ్బతీసాం! మన దేశాన్ని సంఘటితం చేసే పని చేతివృత్తులవారిని కలుపుకోవటంతోటే జరగాలి!"

అట్లా మొదలైంది, భారత దేశంలో, ఖద్దరుబట్ట ఉద్యమం. "మన పంటలకు, మన వృత్తికారులకు, మన దేశానికి మనం ప్రాధాన్యనివ్వాలి. ఖద్దరు ధరించాలి..." ఈ ఉద్యమాన్ని తానే స్వయంగా ముందుండి నడిపాడు, గాంధీ. అంటే తనిప్పుడు మిల్లు బట్టని విడిచివేసాడు. ఊళ్ళో తయారైన దారంతో, ఊళ్ళలో మగ్గాలమీద తయారయ్యే ముతక బట్టని ధరించటం మొదలుపెట్టాడు.

ఆ తర్వాత కొన్నేళ్లకు మళ్ళీ రైల్లో పోతూ తోటి ప్రయాణీకుల్ని అడిగాడు గాంధీ- "మీరంతా ఖాదీ వేసుకోవచ్చు కదా? మిల్లు బట్టలు ఎందుకు వేసుకుంటున్నారు?" అని.

"మీకంటే డబ్బులున్నై, కాబట్టి ఖద్దరు వేసుకుంటారు. అంత ఖర్చు మేం ఎక్కడ పెడతాం?"

అన్నారు వాళ్ళు.




గాంధీని ఆ మాటలు ఆలోచనలో పడేసాయి. "ఖాదీని చవకగా అన్నా తేవాలి.. కానీ అలా చేస్తే నేతగాళ్లకు డబ్బురాదు. దానికంటే మేలు, ఎవరికి తోచినంత ఖాదీ వాళ్ళనే వాడమని చెప్పాలి. నేను మాత్రం పూర్తిగా ఖాదీనే వాడతాను- అది కూడా ఇన్నిన్ని బట్టలు వద్దు. ఒక ధోవతి, ఒక ఉత్తరీయం- అంతే" అని.

అట్లా గాంధీ తను జీవితాంతం గమనించి నేర్చుకుంటూ పోయాడు; నేర్చుకున్న దానిని ఆచరణలో పెడుతూ పోయాడు; తనని తాను మార్చుకునేందుకు ఎన్నడూ సిగ్గు పడలేదు. మన దేశం అన్నా, ఇక్కడి మనుషులన్నా, వాళ్ల బ్రతుకు తెరువులన్నా ఆపేక్షతో "వీటికోసం నేను ఏం చేయగలను?" అని చూసి, దానికి అనుగుణంగా తనను తాను మార్చుకుంటూ పోయిన గాంధీ నిజంగానే మహాత్ముడు.

దుస్తులు అందాన్ని, హుందాతనాన్ని ఇస్తాయి. అయితే అవి కేవలం అలంకరణ ప్రాయాలు కాకూడదు. మనం ధరించే దుస్తులు, మనం వాడే వస్తువులు అన్నీ మన ప్రజలకు జీవనాధారాలు కావాలి. మన కుటీర పరిశ్రమల్ని, చేతి వృత్తుల్ని మనమే నిలబెట్టుకోవాలి.

అందరికీ గాంధీ జయంతి శుభాకాంక్షలతో,

కొత్తపల్లి బృందం.

---

ఇటువంటి ఒక వ్యక్తి నిజంగా మన మధ్య జీవించాడని రాబోయే తరాలవారు నమ్మలేరు...

ఈ శతాబ్దపు రాజకీయవేత్తలందరి సూత్రీకరణల కంటే గాంధీగారి అభిప్రాయాలు మేలైనవి అని నాకు అనిపిస్తుంది. మనకు కావలసిన దాని కోసం హింసతో పోట్లాడటం కాదు; అన్యాయం అని మనకు తోచినదానికి ఏ మాత్రమూ సాయము చేయకుండా ఉండటం మన బాధ్యత! – ఆల్బర్ట్ ఐన్‌స్టీన్

# ఐదు వేళ్ళ కథ

*మన చేతి వేళ్ళకి మాటలొస్తే ఏం మాట్లాడుకుంటాయి? ఇదిగో, హిమవర్షిణి చెబుతున్నది...*

*కథనం : హిమ వర్షిణి, 8 వ తరగతి, రిషీ వ్యాలీ స్కూల్*



ఒక రోజు మన చేతికున్న ఐదు వేళ్ళూ ఎవరు గొప్ప, ఎవరు ఎక్కువ, ఎవరు ముఖ్యం, అని మాట్లాడుకోసాగాయి. మొదటగా చూపుడువేలు తన గొప్పతనం గురించి చెప్పింది: "నేనే అందరికంటే గొప్పవాడిని! ఎందుకంటే ఏ మనిషినైనా, వస్తువునైనా గుర్తించి చూపించేందుకు నన్నే వాడతారు" అని.



"కాదు కాదు అందరికంటే నేనే గొప్ప!" అంది మధ్య వేలు "ఎందుకంటే మీ అందరికంటే నేనే పొడుగ్గా, దృఢంగా ఉన్నాను!"



"కాదు కాదు- మీ అందరికంటే నేనే గొప్పదాన్ని" అంది ఉంగరపు వేలు. "ఎందుకంటే అందరూ బంగారు కిరీటం పెట్టినట్లు నాకే ఉంగరం పెడతారు!"



"లేదు. అందరికంటే నేనే గొప్ప!" అంది చిటికెన వేలు కల్పించుకొని. "ఎందుకంటే నేను రెండు మనసులను కలుపుతాను!"



"కాదులే! అందరికంటే నేనే గొప్ప!" అంది బొటన వేలు. "ఎందుకంటే ఎవరినైనా చాలెంజ్ చెయ్యడానికి నన్నే వాడుతారు. అంతే కాదు- నేను గనక లేకపోతే మీ వల్ల ఏ ఉపయోగమూ ఉండదు! ఏ పని చేయాలన్నా నేను ఉండాల్సిందే! అందుకని నేనే గొప్ప, అందరి కంటే!"

దాంతో గందరగోళం చెలరేగింది. ఐదు వేళ్ళూ 'నేను గొప్ప' అంటే ; 'నేనే గొప్ప' అంటూ ఒక్కసారిగా వాదులాడుకోవటం మొదలెట్టాయి.

అప్పుడు చెయ్యి కల్పించుకొని, వాటన్నిటికి ఒక మాట చెప్పింది: "ఒక్క నిమిషం!! జాగ్రత్తగా చూడండి- మీలో ఏ ఒక్కరివల్లా అన్ని పనులూ సమకూరవు. పనులు జరగాలంటే మీరందరూ కావలసిందే. అంతేకాదు- మీరంతా ఐకమత్యంగా ఉంటేనే ఉపయోగం! ఏ ఒక్కరు లేకున్నా కష్టమే! అందువల్ల మీలో ఎవరూ ఇంకొకరికంటే గొప్ప కాదు.ఏ ఒక్కరూ ఇంకోరి కంటే తక్కువా కాదు!" అని.

చెయ్యి చెప్పిన మాటలో వాస్తవాన్ని గుర్తించినై, వేళ్లన్నీ. "మనం అందరం గొప్పవాళ్లమే! ఐకమత్యమే మహాబలం!" అన్నాయి ఒక్క పిడికిలిగా దగ్గరై.

**ఏడవలేక-నవ్వలేక**

టీచర్: వంద రూపాయల నోటు మీద గాంధీ తాత నవ్వుతూ ఎందుకుంటాడు?

రాంబంటు: ఏడుస్తుంటే మరి నోటంతా తడయిపోతుంది గదండీ! అందుకని!

నవ్వు!

**పండగ రోజు!**

సుబ్బారావు: ఏంరా, స్వీట్లు పంచుతున్నావు- ఏంటి, విశేషం?

అప్పారావు: మా అవిడ పదేళ్లుగా చూస్తున్న టీవీ సీరియల్ అయిపోయిందిరా! అందుకు!

# చిలుకతో స్నేహం

*రచన: గోదా లిఖిత్ కుమార్, ఇంటర్మీడియట్, బనిగండ్లపాడు, ఖమ్మం జిల్లా*

ఒక అడవి అంచున చెన్నప్ప అనే బోయవాడు ఒకడు ఉండేవాడు. రోజూ ఏదో ఒకటి వేటాడి తెచ్చుకొని కడుపు నింపుకునేవాడు. అతనికి దగ్గరి బంధువులు అంటూ పెద్దగా ఎవ్వరూ లేరు- ఒంటరివాడు.




ఒకరోజు అతను బిగించిన ఉచ్చులో చక్కని రామ చిలుక ఒకటి తగులుకున్నది. చాలా అందంగా, ముద్దుగా ఉన్నదది. అది దొరికిన రోజున ఇంట్లో తినేందుకు వేరే ఏమీ లేవు; కానీ చెన్నప్పకు దాన్ని చంపబుద్ధి కాలేదు. 'దీన్ని తింటే ఏం కడుపు నిండుతుంది?' అని దాన్ని ఓ పంజరంలో పడేసి, తను ఇన్ని నీళ్ళు త్రాగి పడుకున్నాడు.

తర్వాతి రోజున చెన్నప్ప నిద్రలేచే సరికి అది పంజరంలోనే తిరుగుతూ చక్కగా పాటలు పాడుతున్నది. అతనికి దాన్ని చూస్తే బలే ముచ్చట అనిపించింది. "సరేలే! నీ టైం బాగుంది" అని వాడు దానికి కొన్ని పళ్ళు, విత్తనాలు తెచ్చి ఇచ్చి, వేటకు వెళ్ళాడు.

ఆ రోజున అతను ఇంటికి వచ్చేసరికి చిలుక "ఇంత లేట్టైందేం?" అన్నది. అతను దానికేసి వింతగా చూసాడు. రోజులు గడుస్తున్న కొద్దీ అతనికి చిలుకతోటి అనుబంధం పెరిగింది. దాని రెక్కలకి బంధం వేసి, ఇప్పుడు తనతో

పాటు వేటకి కూడా తీసుకువెళ్తున్నాడు, చెన్నప్ప. దానికి ఏ లోటూ లేకుండా చూసుకుంటున్నాడు.

ఒక రోజున అతను చిలకను వెంటబెట్టుకొని అలా వేటకు వెళ్ళాడు. ఆ రోజున ఏ జంతువూ దొరకలేదు; ఎండ బాగా ఉంది కూడా. మధ్యాహ్నం అయ్యేసరికి చెన్నప్ప బాగా అలసిపోయాడు. వేటను ఆపి ఒక చెట్టుకింద విశ్రాంతిగా పడుకున్నాడు.

అతన్ని అలా చూసేసరికి రామచిలకకి జాలి అనిపించింది. దగ్గర్లో అంతటా వెతికి, ఓ పళ్ల చెట్టు మీదికి అతి ప్రయత్నం మీద ఎగిరింది. కొన్ని పళ్లను తను తిని, చెన్నప్ప కోసం కూడా కొన్ని పళ్ళు తీసుకున్నది.

'ఇక క్రిందికి దూకుదాం' అనుకుంటుండగా దానికి భయంగొలిపే దృశ్యం ఒకటి కనిపించింది!

చెన్నప్ప పడుకున్న చెట్టు వెనకనే ఒక పొద ఉన్నది. ఆ పొదలోనే ఒక పులి కూర్చొని ఉన్నది. అది ఆశగా చెన్నప్ప వైపే చూస్తూ, పెదిమలు నాక్కుంటున్నది! దానికి ఆకలిగా ఉందని, ఏదో ఒక క్షణంలో అది చెన్నప్ప మీదికి దూకబోతున్నదని చిలుకకు అర్థమైంది.

దాని బుద్ధి చురుకుగా పని చేసింది. చెన్నప్ప పడుకున్న చెట్టు పైనే ఒక తేనెతుట్టె ఉంది. అతనికి ఇచ్చేందుకు తను కోసిన పండ్లను అది గురిచూసి సూటిగా ఆ తేనెతుట్టె మీదికి విసిరేసింది.




తేనెటీగలు 'జుం' అంటూ లేచాయి. కొన్ని తేనెటీగలు సూటిగా క్రింద ఉన్న పొద వైపుకు దూసుకు పోయాయి. వెంటనే పులిని కుట్టటం మొదలెట్టేసాయి కూడా!

పులి గిరుక్కున వెనక్కి తిరిగింది. తనను చుట్టుముడుతున్న తేనెటీగలనుండి తప్పించుకోవటం కోసం దూరంగా పరుగు తీసింది.

ఇక చిలుక చెన్నప్ప దగ్గరికి వెళ్ళి "లే!లే! త్వరగా!" అని అరిచింది. చెన్నప్ప లేచేసరికి చుట్టూ తేనెటీగలు ముసురుకుంటున్నాయి. చటుక్కున తను వెంటతెచ్చుకున్న గోనెసంచీలో దూరాడతను!

తేనెటీగలు పోయాక బయటికి వచ్చిన చెన్నప్పకు చిలుక పులి సంగతి చెప్పింది. పొదలో పులి ఉండిన గుర్తులు కూడా చూసాక, చెన్నప్పకు చిలుక అంటే ప్రత్యేకమైన అభిమానం కలిగింది. "నువ్వు చాలా గొప్ప స్నేహితుడివి! నా ప్రాణాలు కాపాడావు! నీకు ఏ బహుమతి ఇవ్వమంటావు, చెప్పు!" అన్నాడతను.

"వేరే ఏమీ వద్దు- నీకు ఇష్టమైతే నా రెక్కలకు కట్టిన బంధాలు తీసెయ్యి. నన్ను స్వేచ్ఛగా ఎగరనియ్యి!" అన్నది చిలుక.

చెన్నప్ప మారు మాట్లాడకుండా దాని రెక్కలకున్న బంధాలను తొలగించాడు. 'చిలుక ఎగిరిపోతుంది' అనుకున్నాడు. కానీ అది అతన్ని విడిచి పోలేదు!

ఇప్పుడు వాళ్ల స్నేహం మరింత గట్టిపడింది.



**కొన్ని సామెతలు-జాతీయాలు:**

1. అగ్నికి వాయువు తోడైంది.
2. అత్త సొమ్ము- అల్లుడు దానం!
3. అదిగో తెల్లకాకి అంటే ఇదిగో పిల్లకాకి అన్నాట్ట!
4. అదిగో పులి అంటే ఇదిగో తోక అన్నాట్ట!.
5. అద్దం అబద్దం ఆడుతుందా ?!
6. చెడపకురా, చెడేవు!

నీ పాద కమల సేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యము
నితాంతాపార భూత దయయును
తాపస మందార! నాకు దయ సేయగదే!

భావం: "తాపసులకు దిక్కైనవాడా, నీ పాదాలను సేవించే అవకాశాన్ని, నిన్ను ఇష్టపడేవారి సహవాసాన్ని, ప్రాణుల పట్ల అంతులేని దయను నాకు ప్రసాదించు!"




# చిన్న సాయం

*రచన: పిట్టమల్ల శ్రీను, 5 వ తరగతి, ప్రాథమికోన్నత పాఠశాల, కంకణాలపల్లి, ప్రకాశం జిల్లా.*



కంకణాలపల్లిని ఆనుకొని చాలా కొండలు ఉండేవి. రాము అనే పిల్లవాడు ఒకడు రోజూ సాయంత్రం బడి వదిలాక, ఊరి అవతల ఉన్న బండమీదికి వచ్చి కూర్చునేవాడు. చుట్టూ ఉన్న కొండల్ని, ప్రకృతిని చూసి సంతోషపడేవాడు.

రెండు మూడు రోజులుగా అతనికి అక్కడ ఒక ఆవు, దూడ కనిపిస్తున్నాయి. రెండూ పడుకొనే ఉంటున్నాయి- పెద్దగా కదలట్లేదు,

మెదలట్లేదు. బాగా సన్నగా ఉన్నాయి. రాముకి వాటిని చూస్తే జాలివేసింది. "అయ్యో! వీటికి మేత ఉన్నట్లు లేదు. ఎక్కడా గడ్డి కూడా లేదు; పాపం" అనిపించింది.

దగ్గర్లోనే ఉన్న చెట్టు నొకదాన్ని ఎక్కి, కొన్ని కొన్నిగా ఆకులు తుంచి వాటికి అందించాడు.

తరువాతి రోజున రాము వచ్చేసరికి ఆవు-దూడ రెండూ అక్కడే కూర్చొని ఉన్నాయి. ఆరోజున కూడా వాటికి ఆకులు తుంచివేశాడు రాము. అట్లా కొన్ని రోజులు గడిచే సరికి అవి కొంచెం తేరుకున్నాయి.

అప్పుడు రాముకి ఒక ఆలోచన వచ్చింది. కొండపైన అంతా తిరిగి, దొరికినన్ని ఎండిన తాటి మట్టల్ని ఈడ్చుకొచ్చాడు. వాటిని ఒక్కటొక్కటిగా తీగలతో వ్రేలాడగట్టాడు చెట్టుకు. అలా రోజుకు కొన్ని చొప్పున తెచ్చి చిక్కగా కట్టి, అక్కడ ఒక నీడ కల్పించాడు.

కొన్ని రోజులకు వాన పడింది. పోయి రాము తయారుచేసిన కప్పు కింద నిలబడ్డాయి ఆవు-దూడ. చూసి రాము అనందపడ్డాడు.

మరి కొన్ని రోజులయ్యేసరికి ఆ చుట్టుప్రక్క-లంతా పచ్చి గడ్డి మొలిచింది. బలం పుంజుకున్న ఆవు-దూడ ఇప్పుడు తమంతట తాము పోయి పచ్చిగడ్డి మేస్తున్నాయి.



"అరె..వాటికి మేత దొరికింది!" అని రాము ఎంతో సంతోషపడ్డాడు.

ఇక ఆకులు తుంచలేదు. పైకి చెట్టుమీదకు చూశాడు. అక్కడ ఆకులు తుంచిన చోట మళ్ళీ ఇగురు వచ్చింది. అది చూసి ఇంకా సంతోషపడ్డాడు రాము.




# జింక చాతుర్యం

*నిజమే. మిత్రులు సాయం చేస్తారు, కానీ మన పని మనం చేసుకోవటం ఏనాటికైనా మంచిదే.. కదా?!*

*రచన : చాతుర్య, 7 వ తరగతి, రిషీ వ్యాలీ స్కూల్,*

అనగా అనగా ఒక అడవిలో జింక ఒకటి ఉండేది. అది చాలా మంచిది, బాగా తెలివైనది కూడా. ఎవరితోటైనా చక్కగా, మర్యాదగా మాట్లాడి వాళ్లని మెప్పించేది. దాని మాట తీరు బాగుండటం వల్ల, అడవిలో ఉండే చాలా జంతువులు దానికి స్నేహితులైనాయి.

అయితే కష్టాలు ఎవరికైనా రావచ్చు కదా, ఒక రోజున ఆ జింక ఒక వేటగాడి ఉచ్చులో చిక్కుకున్నది.

వేటగాడు వచ్చి, దాన్ని చూసి చాలా సంతోష పడ్డాడు. "ఆహా! ఎంత మంచి జింక పట్టుబడింది! దీన్ని అమ్మితే నాకు చాలా డబ్బులు వస్తాయి" అనుకొని, అతను దాన్ని

వలతో సహా తన ఇంటికి తీసుకెళ్ళాడు.

అప్పటికి బాగా సాయంత్రం అయింది. చీకటి పడబోతున్నది. దాంతో అతను దాన్ని వలలోనుండి తీయకనే తన ఇంటి బయట ఉన్న పూరిపాకలో పడేసి, పాకకు గట్టి తాళం వేసి తను వంట పనిలో మునిగాడు. జింక దు:ఖం రెట్టింపు అయ్యింది. అది తన కష్టాల్ని తలచుకుంటూ




కాపాడండి కాపాడండి - కాపాడండి ఎవరైనా వలలోనుండి తప్పించండి - మీ మేలు ఇక మరువనండి.. అని పాడటం మొదలెట్టింది బాధగా.

అంతలో అటుగా వెళ్తున్న ఎలుక ఒకటి జింక పాటను విని, దాని దగ్గరికి వచ్చింది. సంగతి తెలుసుకొని, రాత్రంతా శ్రమపడి వలను కొరికి ముక్కలు చేసి, జింకను బయటికి లాగింది. జింకకు ప్రాణం లేచి వచ్చింది. దానికి ధన్యవాదాలు చెప్పుకున్నది.

అయితే మూసి ఉన్న తలుపులోంచి బయటికి పోలేదు కదా, అందుకని అది తలుపుకు ఒక ప్రక్కగా నిలబడి, వేటగాడు తలుపు తీయటం కోసం ఎదురు చూడటం మొదలు పెట్టింది. అది వలలోంచి తప్పించుకొని ఉంటుందని ఊహించని వేటగాడు ఉషారుగా ఈల వేసుకుంటూ గడియ తీసాడు. అంతలోనే జింక గబుక్కున ముందుకు దూకి, అతన్ని పక్కకు నెట్టి తప్పించుకొని, చకచకా అడవిలోకి పరుగు తీసింది!

వేటగాడు కొంతసేపు దాని వెంట పరుగెత్తాడు- అయినా దాన్ని అందుకోలేక నిరాశగా వెనుతిరిగాడు.

ఎంత వేటగాడినుండి తప్పించుకున్నా, ఈ

క్రమంలో జింక మనసు బాగా గాయపడింది. అదిప్పుడు చాలా పిరికిగానూ, అన్నిటికీ ఇతరుల మీద ఆధార పడేదిగాను తయారైంది.




అట్లా భయం భయంగా తింటుంటే గడ్డి ఎందుకు ఒంట పడుతుంది? అందుకని అది రాను రాను సన్నగా, బలహీనంగా తయారవ్వసాగింది. అంతే కాదు, దాని మాట తీరు కూడా మారింది. ఇంతకుముందు లాగా అది అందరినీ ఉత్సాహంగా పలకరించటం లేదు.

ఎవరిని చూసినా, "నీకు ఇవాళ్ళ వేటగాడు ఏమైనా కనిపించాడా?" అని అడగటం మొదలు పెట్టిందది. దాంతో అడవిలోని మిగతా జంతువులు కూడా దానిని తప్పించుకు తిరగటం మొదలు పెట్టాయి.

అంతలోనే దానికి ఇంకోసారి వేటగాడు ఎదురయ్యాడు! అయితే ఆ రోజున వాడు వెనక్కి తిరిగి ఉన్నాడు- జింకని గమనించలేదు. జింక మెల్లగా వెనక్కి తిరిగి, నాలుగైదు అడుగులు వేసి, తర్వాత తోచిన దిక్కుకు పరుగు పెట్టింది.

అల్లంత దూరాన దానికి ఒక ఏనుగు కనబడింది- జింక దాని దగ్గరికి పోయి "వేటగాడు! వేటగాడు! వస్తున్నాడు! నన్ను కాపాడు!" అని మొరపెట్టుకున్నది.

ఏనుగు దానికేసి చూసి, "అయ్యో! జింకా! నాకు ఇప్పుడు చాలా పని ఉంది. నువ్వు కోతి దగ్గరకు వెళ్ళరాదూ?!" అన్నది.

జింక గబగబా కోతి దగ్గరకు వెళ్ళి, "వేటగాడు తిరుగుతున్నాడు అడవిలో! నన్ను కాపాడు, ప్లీజ్" అంది.

కోతి ముఖం చిట్లించుకొని- 'ఎక్కడు-న్నాడు?' అన్నది. 'అదిగో ఆ వంక అవతల ఉన్నాడు. అటుతిరిగి ఉన్నాడు. నన్ను చూడలేదు వాడు" అంది జింక.

"మరింకేమి భయం?" అంది కోతి "నాకు చాలా ఆకలిగా ఉంది. ఆహారం వెతుకోవడానికి వెళ్తున్నాను. నువ్వు ఏమీ భయపడకు. అంతగా ఐతే కుందేలు దగ్గరకు వెళ్లు!" అంటూ.

వెంటనే జింక కుందేలు దగ్గరకు పరుగెత్తింది. "నన్ను కాపాడు! వేటగాడు వచ్చేస్తున్నాడు" అన్నది. "ఎక్కడ? ఎక్కడ?" అని హడావిడి పడిన కుందేలు, "వంక అవతల" అని తెలియగానే నవ్వేసి, ఏదో ఒక సాకు చెప్పి తప్పించుకున్నది.

జింకకు ఇక ఏం చేయాలో తోచలేదు. అంతలో దానికి వేటగాడి అడుగుల శబ్దం వినబడింది. దూరంనుండి వాడు తనవైపుకే వస్తున్నాడు!

దానికి చాలా భయం వేసి, చుట్టూ వెతుక్కున్నది. ఒక వైపున పెద్ద పొదలు కనిపించాయి దానికి. అది చటుక్కున వెళ్ళి ఆ పొదల్లో నక్కింది. చెవులు నిక్కించి శబ్దాలను వినసాగింది. ఏ మాత్రం అలికిడైనా వెనక్కి తిరిగి పారిపోయేందుకు సిద్ధంగా ఉంది...

కొంచెంసేపట్లో వేటగాడు వచ్చాడు అటువైపు. అయితే అతనికి అక్కడ ఏ జంతువులూ కనబడలేదు. దాంతో అతను అట్లాగే ముందుకు వెళ్ళిపోయాడు!

అతను వెళ్ళిపోయాక పది నిముషాలవరకూ ఊపిరి బిగబట్టుకొని కూర్చున్న జింక, ఆ తర్వాత బయటికి వచ్చి తన ఇంటి వైపుకు పరుగు పెట్టింది. అయితే ఆ అనుభవంతో దానికి పట్టుకున్న భయం వదిలింది. దాంతోబాటు ఇంకో సంగతి కూడా అర్థమైంది: "అవసరార్థం ఇంకోళ్లను నమ్ముకోకూడదు. వీలైనంత వరకూ తెలివితేటలను ఉపయోగించి మన పనిని మనమే చేసుకోవాలి. ఎప్పుడూ ఇంకోళ్ళమీద ఆధారపడితే కష్టం" అని.




# తల్లి కోడి

తెలుగు జానపద కథ

*జానపద కథల్లో పాత్రలు జన జీవితాలకు దగ్గరగా-దూరంగా బలే ఉంటాయి. రాజకుమారులు ఉంటారు; అయితే వాళ్ళుకూడా అందరు ప్రజల్లాగే మామూలుగా ఉంటారు. విరివిగా కనబడే ఈ మామూలుదనం ఆ కథకు 'ఇది' అని చెప్పలేని 'ఏదో అదనపు అందాన్ని' ఇస్తుంది- ఇదిగో, ఈ కథలో లాగా !*

*సేకరణ: ఆకాష్ కోటంపల్లి, 9 వ తరగతి, మోడల్ స్కూల్ , చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా*

అనగనగా ఒక అడవిలో ఒక కోడి ఉండేది. అడవి అవతల ఉన్న ఊళ్లోకి వెళ్ళి, ప్రతి రోజూ అక్కడ పడేసిన గింజలు తిని బ్రతికేది అది.

కొన్ని రోజులకు అది మూడు గుడ్లు పెట్టింది. అవి మామూలు సైజు కంటే చాలా పెద్దగా ఉండినై. కోడి ఆ గుడ్ల మీద కూర్చొని జాగ్రత్తగా పొదుగుతూ ఉంటే అవి కూడా రోజు రోజుకూ పెద్దవౌతూ పోయినై. అట్లా పది నెలలు గడిచాక, వాటిలోంచి ముగ్గురు ఆడపిల్లలు బయటికి వచ్చారు!

కోడి ఎంతో ప్రేమతో వాళ్లని పెంచి పెద్ద చేసింది. రకరకాల పనులు, విద్యలు నేర్పింది. వాళ్లు ఉండేందుకు ఊళ్ళో ఒక పెంకుల ఇల్లు కూడా కట్టింది.

కొన్నాళ్లకు వాళ్ళు ముగ్గురూ పెద్దయ్యారు. చాలా అందంగా, దేవకన్యల్లాగా అయినారు.

ఒక రోజున ఊళ్లో ఒక పండుగ జరుగుతోంది. కోడి తల్లి ఆ అమ్మాయిలతో అంది "మీరు అడవిలో ఉన్న కొలనులోంచి నీళ్ళు తీసుకు రండి; నేను రాగానే అందరం కలిసి పూజ చేసుకుందాం" అని. అమ్మాయిలు ముగ్గురూ మూడు కడవలు పట్టుకొని పోగానే, తను సామానుల కోసం ఊళ్ళోకి పోయింది.




ఆ రోజున ఊళ్ళో జాతర చూసేందుకు రాజుగారి కొడుకులు ముగ్గురు వచ్చారు. ఇంకా సమయం ఉంది కదా అని ముగ్గురూ గుర్రాలెక్కి అడవిలో వేటకు వెళ్ళారు. అయితే ఎంత తిరిగినా వాళ్లకు అక్కడ ఒక్క జంతువు కూడా కనిపించలేదు. చివరికి వాళ్ళు బాగా అలసిపోయారు; విపరీతంగా దాహమైంది. "కొలను ఎక్కడ?" అని వెతుక్కుంటూ పోయారు వాళ్ళు. వాళ్ళు సరిగ్గా కొలను చేరే సమయానికి ఈ అమ్మాయిలు ముగ్గురూ కడవలు ఎత్తుకొని ఎదురయ్యారు వాళ్లకి.

"అమ్మాయిలూ, మేం ఈ ఊరి రాజకుమారులం. బాగా దాహం వేస్తోంది. ఇన్ని నీళ్ళు పోస్తారా?" అన్నారు వాళ్లతో.

వాళ్లని చూడగానే ముగ్గురు అమ్మాయిలకూ వాళ్లంటే జాలి పుట్టింది. ఇంటికోసం తీసుకెళ్తున్న నీళ్ళను వాళ్ళకు పోసారు.

ఆ సమయంలో వాళ్లని గమనించిన రాజకుమారులు "అబ్బ! వీళ్లెవరో మామూలు అమ్మాయిలు కాదు! దేవకన్యలే అయిఉంటారు! వీళ్లని పెళ్ళి చేసుకోవాలి" అనుకున్నారు.

అమ్మాయిలు కూడా వాళ్లను చూసి

ఇష్టపడ్డారు. "మా అమ్మని అడిగి చెబుతాం" అన్నారు.

"అయితే సరే, మేం మీరు సరేననటం కోసం ఎదురు చూస్తుంటాం" అన్నారు రాజకుమారులు.

అమ్మాయిలు ఇంటికొచ్చి తల్లిని అడిగారు: "అమ్మా! వీళ్ళు మాకు బలే నచ్చారు; పెళ్ళి చేసుకుంటాం" అని.

"మంచిదే అమ్మాయిలూ!" అంది తల్లికోడి- "అయితే వాళ్ళేమో రాజకుమారులు! మీరేమో మామూలు కోడి పిల్లలు. వాళ్ళు మిమ్మల్ని ఇష్టపడుతున్నారో లేదో, చూసుకోండి. నిజంగా ఇష్టం ఉంటే చేసుకోండి. అయితే వాళ్ల వాళ్ళకు నేను కనబడితే మటుకు మీ సంబంధం కలవదు. అందుకని నేను మీ పెళ్ళికి రాను. ఎవరైనా అడిగితే మీ అమ్మ ఎక్కడికో వెళ్ళిందని చెప్పండి" అన్నది.

పెద్ద అమ్మాయిలు ఇద్దరూ రాజకుమారులకు కోడి చెప్పమన్నట్టే చెప్పారు. వాళ్ళిద్దరూ వాళ్లని పెళ్ళి చేసుకునేందుకు ఒప్పుకున్నారు. కానీ మూడో అమ్మాయి మాత్రం 'మా అమ్మ ఒక మామూలు కోడి. అందుకని పెళ్ళికి రాదు" అని నిజం చెప్పేసింది తన కాబోయే మొగునికి. అయినా అతను కూడా "ఏమీ పర్లేదు" అనేసాడు.

వెంటనే మూడు జంటల పెళ్ళిళ్ళు కూడా జరిగిపోయాయి. 'ఇక వాళ్లంతా భర్తలతో బాటు బయలుదేరతారు' అనగా తల్లికోడి వాళ్ళు ముగ్గురికీ మూడు సంచుల్లోకి కొన్ని గింజలు వేసి ఇచ్చింది. ఆ సంచులకు క్రింద వాళ్లకు తెలీకుండానే చిన్న రంధ్రం పెట్టింది.

రాజకుమారులు వాళ్లని తీసుకొని గుర్రాల మీద బయలుదేరారు. తల్లి ఇచ్చిన గింజల సంచీలు అమ్మాయిల చేతుల్లోనే ఉన్నాయి. వాళ్ళు వేగంగా పోతుంటే, సంచిలోని గింజలు కూడా ఒకొక్కటీ క్రిందికి జారి పడుతూ పోయాయి. అట్లా కలిసి కొంత దూరం పోయి, ఆ తర్వాత ఒక్కొక్క రాజకుమారుడూ ఒక్కో దిక్కుకు

వెళ్ళిపోయారు.



రోజులు, నెలకు గడిచాయి. తల్లికోడికి పిల్లలు గుర్తుకొస్తున్నారు. వాళ్ళు ఎట్లా ఉన్నారో అని ఆదుర్దా ఎక్కువైంది. వర్షం ఎప్పుడు పడుతుందా, విత్తనాలు ఎప్పుడు మొలకెత్తుతాయా అని చూస్తూ ఉండింది.

చూస్తూండగానే వానాకాలం వచ్చింది. రాత్రి పెద్ద వర్షం పడింది. ఆ తల్లి గుండె నిబ్బరం అయింది. ప్రొద్దున్నే బయటకి వచ్చి చూస్తే గింజలన్నీ మొలకెత్తి ఉన్నాయి!

కోడి ఎగిరి గంతేసి, ఆ మొలకల్నే వెంబడించుకుంటూ పోయింది. అట్లా పోయి పోయి, ముందు పెద్ద కూతురు దగ్గరికి చేరుకున్నది. పెద్ద కూతురు ఉండేది చాలా పెద్ద భవంతి. "ఎట్లా చెయ్యాలి?!" అని ఆలోచించి కోడి మెల్లగా పోయి, భయపడుతూనే తలుపు తట్టింది. "ఎవరు, తలుపు కొట్టారు?" అని ఆ పెద్దకూతురు వచ్చి చుట్టూ చూసింది. ఆమె చాలా నగలు, నాణ్యాలు అన్నీ చాలా ఒంటెనిండా వేసుకొని ఉండింది.

"నేనేనే! బాగున్నారా, మీరు?" అంది తల్లి కోడి సంతోషంగా.

అప్పుడు ఆ పిల్ల క్రిందికి చూసి, "నువ్వా?! నువ్వెందుకు వచ్చావు?!" అని అడిగింది చికాకుగా.

అప్పుడు తల్లి కోడి నిర్ఘాంతపోయి "ఏంటమ్మా, ఇలా అంటావు?! నేను మీ అమ్మను గదా?!" అన్నది.

"బానే ఉంది! 'మా అమ్మ ఒక పనికిరాని కోడి' అని తెలిస్తే మా ఆయన నన్ను

గెంటేస్తాడు. ముందు నువ్వు ఇక్కడి నుండి వెళ్ళిపో!" అని ప్రక్కనే ఉన్న కట్టె తీసుకొని రెక్కకు విసిరింది బిడ్డ. అంతే తల్లికోడి రెక్క కాస్తా విరిగి పోయింది, ఆమె మనసుతో పాటు.



ఇంక అలాగే ఆ రెక్కను ఈడ్చుకుంటూ రెండవ కూతురు దగ్గరికి పోయి, ఆమె ఇంటి తలుపు తట్టింది.

ఆ సమయానికి ఆమె చపాతీలు తిక్కుతున్నది. తలుపు కొడితే పని ఆపి వచ్చి తలుపు తీసి, ఆమె కూడా పైపైకే చూసింది- "ఎవరు, తలుపు కొట్టారు?" అనుకుంటూ.

తల్లి కోడికి ప్రేమ పొంగుకొచ్చింది. "బాగున్నావానే? నేనే, తలుపు కొట్టింది!" అన్నది.

ఆమె చటుక్కున క్రిందికి చూసి "నువ్వా?! నువ్వెందుకు వచ్చావు ఇక్కడికి? నేనేదో బాగా కాపురం చేసుకుంటుంటే మధ్యలో నువ్వొచ్చావు నా ప్రాణానికి ముందు ఇక్కడి నుండి పోతావా, లేదా?" అని చపాతీ కర్రను కోడి మీదికి విసిరింది. ఆ దెబ్బకు కోడి రెండవరెక్క కూడా విరిగిపోయింది.

తల్లి మళ్ళీ రోడ్డు మీద పడింది. మూడవ కూతురు దగ్గరికి వెళ్తే 'ఇంక మిగిలి ఉన్న ప్రాణం కూడా పోతుందేమో' అనుకున్నది. మళ్ళీ "పోతే పోయింది పాడు ప్రాణం. బిడ్డ చేతిలోనే పోనీ" అనుకొని, దేకుకుంటూ చిన్న కూతురు ఇల్లు చేరుకొని తలుపు తట్టింది.

చిన్న కూతురు వచ్చి క్రిందికి చూస్తే రక్తం ఓడుతూ ఉన్నది వాళ్ల అమ్మ!

అట్లా వాళ్ల అమ్మను చూసే సరికి ఆ బిడ్డకు

ఏడుపొచ్చింది. వెంటనే తల్లికోడిని చేతిలోకి తీసుకొని "ఏమయిందమ్మా?!" అని అడిగింది. తల్లికోడి జరిగిందంతా చెప్పింది.



వెంటనే ఆమె ఆ గాయాలను శుభ్రం చేసి, రెక్కలకు మందువేసి, గుడ్డతో కట్టి, తినేందుకు గింజలు పెట్టింది.

'అప్పటికే బాగా అలసిపోయిన కోడి అమెను ఆశీర్వదించి, గింజలు తిని, కొంచెంసేపటికి అట్లానే తలవాల్చేసింది!

ఆ కూతురు పాపం బాధతో ఏడ్చి ఏడ్చి వేసింది.

అంతలోనే ఇంక భర్త వచ్చే సమయం అవుతున్నది. మూడో కూతురు లేచి వాళ్ల అమ్మను ఓ అట్టపెట్టెలో జాగ్రత్తగా పడుకోబెట్టి, మూత వేసి కట్టేసి, ఏడ్చుకుంటూనే పైన అటక మీద పెట్టింది. ఆ వెంటనే కళ్ళ నీళ్ళు తుడుచుకొని మామూలుగా కూర్చున్నది.

కొద్ది సేపటికి భర్త వచ్చాడు. "ఏంటి ఈమె ఇట్లా ఉంది ఈ రోజు?!" అనుకున్నాడు. అయినా ఏమీ అనకుండా అన్నం తిని, మంచం వేసుకొని పడుకొని, అలా పైకి చూశాడు. అటకమీద కొత్త పెట్టె కనబడింది- భార్యను పిల్చి "అందులో ఏముంది?" అని అడిగాడు.

అకస్మాత్తుగా అడిగే సరికి ఆమెకి ఏం చెప్పాలో తెలీక "మా అమ్మ వచ్చిందండి-ఏవో తిండి వంటకాలు చేసిందట, ఇచ్చి వెళ్లింది" అని చెప్పేసింది.

"అవునా?! ఎప్పుడు వచ్చారు?! మళ్ళీ అప్పుడే ఎందుకు వెళ్ళిపోయారు? అయ్యో, పెట్టెని పైన పెడితే ఇంక వంటలు మనం

తింటామా?! దాన్ని దింపుతాను ఆగు- ఏమైనా తిందాం" అని ఆమె ఎంత వద్దంటున్నా వినకుండా పైకెక్కి, పెట్టెను క్రింది దింపాడు రాజకుమారుడు.




అమె భయపడుతూనే పెట్టెను తెరిచింది. చూస్తే అందులో తల్లికోడి లేదు- దాని నిండా వజ్రాలు, రత్నమాణిక్యాలు, వెండి, బంగారం"!

ఇద్దరూ చాలా ఆశ్చర్యపోయారు.

"మీ అమ్మా వాళ్ళు ఇంత ధనవంతులా?" అని అడిగాడు రాజకుమారుడు.

"ఏమీ లేదు. మా అమ్మ పాపం చాలా పేద కోడి, చాలా కష్టపడి మమ్మల్ని పెంచింది. ఇప్పుడు ఇంత సంపద మరి ఎట్లా వచ్చిందో తెలీదు!" అన్నది మూడో కూతురు.

అప్పుడు రాజకుమారుడు "చూడు, ఈ వయసులో మీ అమ్మ అంత కష్టపడి సంపాదించి మనకు తెచ్చి పెడుతుంటే ఏం బాగుంది? ఇంత వరకూ మనం మీ అమ్మ వాళ్ళింటికి వెళ్ళలేదు కదా; ఇప్పుడు వెళ్దాం, బయల్దేరు" అన్నాడు.

ఆమె కళ్ళ నీళ్ళు పెట్టుకొనే "ఎందుకండీ?! చాలా దూరం! మరెప్పుడైనా వెళ్దాం" అన్నది గాని భర్త ఒప్పుకోలేదు. చివరికి ఆమెకు సరేననక తప్పలేదు.

ఇంక ఇద్దరూ తినేందుకు అన్నం కట్టుకొని గుర్రం మీద అట్లా పోసాగారు. అట్లా ఒక రోజంతా ప్రయాణం చేశారు కానీ వాళ్ల ఇల్లు ఇంకా రాలేదు. భర్త ఎంత అడిగినా, భార్య "ఇంకా పోవాలి" అంటూనే ఉంది.

చివరికి ఇంక సాయంత్రం అవుతుండగా

"ఇంక పోలేను. అలసి పోయాను" అన్నాడు రాజకుమారుడు. సరే అని ఇద్దరూ అక్కడ అడవిలోనే ఓ చెట్టు నీడనే గుర్రం ఆపుకొని విశ్రాంతిగా కూర్చున్నారు. రాజకుమారుడికి కొంచెం నిద్రపట్టింది; కానీ భార్య మాత్రం అట్లాగే కూర్చొని ఉంది. భయంతో ఆమెకు చెమటలు పట్టి, బొట్లు బొట్లు గా క్రిందికి కారుతున్నాయి.

ఆ చెట్టు క్రిందే పాము పుట్ట ఒకటి ఉంది. అందులో ఒక పాము. కొంత కాలంగా దానికి వీపు మీద ఒక గుల్ల లేచి, చాలా మండుతోంది. ఏ పనీ చేయనివ్వట్లేదు. అయితే ఈమె

చెమట కారి, ఆ పాము గాయం మీద పడగానే ఆ పాముకి ఎంత చల్లగా అనిపించిందంటే, క్షణంలో అది తన బాధనంతా మర్చిపోయింది. దానికి ఈ మూడోకూతురు మీద చాలా గౌరవం కలిగింది.

దాంతో అది పుట్టలోంచి బయటికి వచ్చి, ఆమెకు మ్రొక్కి, తన సంగతంతా చెప్పి, "తల్లీ! నీకు ఏం సాయం కావాలన్నా చేయగలను. చూస్తే నువ్వేదో అవసరం మీద పోతున్నట్లు ఉన్నావు. ఎందుకు, ఈ అడవి దారి పట్టావు?" అని అడిగింది.

అమె చెప్పింది విని, పాము బాధపడి "ఏమీ పర్లేదు తల్లీ! నీ కోరిక తీరుతుంది. నా బలంతో ఒక ఊరు సృష్టిస్తాను. మీరు ఇద్దరూ అక్కడ మీకు ఇష్టమైనన్ని రోజులు ఉండచ్చు. మేం అందరం నీకు అనుకూలంగా ఉంటాం.." అని ధైర్యం చెప్పింది.

కొద్ది సేపటికి రాజకుమారుడు నిద్రలేచి, మళ్ళీ ప్రయాణానికి నడుం కట్టాడు. "ఇంకా ఎంత దూరం?" అని అడిగితే, "అదిగో- ఆ కనిపించే ఊరే, మా ఊరు!" అని చెప్పింది భార్య. వాళ్ళు అక్కడికి చేరుకునే సరికి, ఆ నగరం అంతా వెండి బంగారాలతో, ధగధగా మెరిసిపోయే పెద్ద పెద్ద భవనాలతో, చక్కని ఉద్యానవనాలతో బలే ఉన్నది. ఊళ్ళోవాళ్ళు కూడా అందరూ వాళ్లని "అక్కా! బాగున్నారా?! బావా, ఎంత కాలానికి

వచ్చారు!" అంటూ ప్రేమగా పలకరించారు.

"మీ ఇంటి తాళాలు ఇవిగో, మీ అమ్మ వీటిని మాకు అప్పగించి పోయింది. ఒక చోట ఉండదు కద!" అంటూ ఓ పెద్ద భవంతి తెరిచి ఇచ్చారు కూడా.

భార్యాభర్తలు ఇద్దరూ అక్కడే రకరకాల వంటలు తింటూ కొన్ని రోజులు గడిపారు. "ఇంక వెళ్ళొస్తాం! చాలా రోజులైంది" అని అందరికీ వీడ్కోలు చెప్పి, బయలు దేరారు.

వాళ్ళు అట్లా గుర్రం ఎక్కి కొంత దూరం వెళ్ళారో-లేదో, ఆ ఊరు ఊరంతా మాయమైపోయింది!

అటుపైన రాజకుమారుడికి సంగతంతా అర్థమైంది: 'ఈమె నిజంగానే ఎవరో దేవకన్య. దేవకన్యలకు అమ్మానాన్నలు ఎందుకుంటారు?' అని అతను మరెన్నడూ ఆమెని తమ ఊరికి తీసుకెళ్ళమని బలవంతపెట్టలేదు. ఇంక వాళ్ళిద్దరూ సిరి సంపదలతో సుఖంగా జీవించారు.

**బలహీనం!**

టీచర్: రవీ! నువ్వు ఇంగ్లీషులో 'వీక్' అని 15సార్లు ఇంపోజిషన్ రాయమంటే అయిదు సార్లే రాశావేం?

రవి: నేను లెక్కల్లో కూడా వీకే టీచర్!




**రెండైదులు పది!**

టీచర్: రామూ! పది పెంపుడు జంతువుల పేర్లు చెప్పు?

రాము: ఐదు కుక్కలు, ఐదు పిల్లులు టీచర్

**మరో అప్పారావు!**

ముఖేష్: ఒక లక్ష అప్పుగా ఇయ్యిరా! నీ రుణం ఈ జన్మలో తీర్చుకోలేను!

మల్లి: అదే కదారా, నా భయం ?!




# ఊహా ప్రపంచం

*రచన: ఆసిఫ్, 8 వ తరగతి, ZPHS, చెన్నేకొత్త పల్లి, అనంతపురం జిల్లా.*




అనగనగా ఒక ఊళ్లో నలుగురు స్నేహితులు ఉండేవారు. ఎప్పుడూ ఆట పాటలతో బలే సరదాగా ఉండేవాళ్లు వాళ్లు. ఒక రోజున వాళ్లు బడికి పోతుంటే వింత దుస్తులు ధరించిన ముసలాయన ఒకడు కనిపించాడు. రోడ్డు దాటేందుకు శ్రమ పడుతున్నాడు ఆయన. పిల్లలకు ఆయన్ని చూసి జాలి వేసింది. "రోడ్డు దాటుతావా, తాతా?" అని అడిగి, ఆయన్ని చెయ్యిపట్టుకొని రోడ్డు దాటించారు.

ముసలాయన వణుకుతున్న గొంతుతో "మేలు మేలు.. మీరు మంచి పిల్లలు. మీలో దయ ఇంకా మిగిలే ఉంది. ఆగండి- మీకు ఏదైనా బహుమతి ఇస్తాను.." అంటూ తన అంగీ జేబుల్లో వెతుక్కోవటం మొదలెట్టాడు.

"ఏమీ అక్కర్లేదులే, తాతా! దానిదేముంది?!" అన్నాడు రమేష్, కొంచెం సిగ్గుపడుతూ.

"కాదు కాదు- మంచి వాళ్లకు ఏమైనా ఇస్తే, అందరికీ మంచి జరుగుతుంది" అన్నాడు తాత పట్టు వదలకుండా, ఇంకా వెతుక్కుంటూ.

చివరికి ఆయనకు కావలసినవేవో దొరికినట్లున్నాయి- "ఏదీ, చేతులు చాచండి" అని నలుగురి చేతుల్లోనూ నాలుగు విత్తనాలు పెట్టాడాయన- "వీటిని ఎవరికి వాళ్ళు నాటండి. మేలు జరుగుతుంది" అంటూ.

అందరూ వెనక్కి తిరిగి పోతుంటే, "ఇదిగో, ఇంకోటి కూడా ఉంది- ఇదికూడా ఉంచుకో, ఎందుకైనా పనికొస్తుంది" అంటూ రమేష్‌కి మరో విత్తనం ఇచ్చాడాయన.

పిల్లలు మొహమాటంగానే ఆ విత్తనాల్ని తీసుకొని, "థాంక్స్" అని చెప్పి బడిలోకి పోయారు.

మళ్ళీ బడి వదిలేసేంతవరకూ ఎవ్వరికీ ఆ సంగతి గుర్తు లేదు. సాయంత్రం ఇంటికి పోతుండగా హరి జేబులో చెయ్యి పెట్టుకుంటే విత్తనం చేతికి తగిలింది. "పొద్దున తాత ఎవరో; బలే ఉన్నాడురా; వెతికి వెతికి మరీ విత్తనాలు ఇచ్చాడు పాపం!" అన్నాడు వాడు, మిగతావాళ్లతో. అందరూ నవ్వుకున్నారు.

"పడెయ్యకండిరా- ఏం విత్తనాలో ఇవి! నలుగురం కల్సి నాటుదాం, ఎక్కడైనా! మన లైబ్రరీ వెనక బాగా బోసి పోయి ఉంటుంది. అక్కడ నాటితే మేలు!" అన్నాడు బాలు.

సరేనని నలుగురూ లైబ్రరీకి పోయి, వెనక ఉన్న ఖాళీ జాగాలో వాటిని నాటి, తలా ఒక చెంబెడు నీళ్ళు తెచ్చి పోసారు.

చూస్తూ చూస్తూండగానే ఆ విత్తనాలు నాలుగూ చకచకా మొలిచాయి! నాలుగు విత్తనాలూ నాలుగు చెట్లయిపోయాయి! ఆ చెట్ల తొర్రల్లోంచి నలుగురు విచిత్ర మనుషులు వచ్చి వీళ్ళముందు నిలబడ్డారు: "మీరు చాలా మంచి వాళ్ళు! ఇన్నాళ్లకి మాకు విముక్తి కలిగించారు. ఏమైనా కోరుకోండి!" అంటూ.




మిత్రులు నలుగురూ ఆశ్చర్యపోతూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"ప్రపంచంలో అంతటా లెక్కలేనన్ని రోబోలు ఉండాలి. అన్నీ మనుషులకు ఏ పనంటే ఆ పని చేసి పెట్టాలి!" అన్నాడు ఆసిఫ్ వెంటనే, గట్టిగా కళ్ళు మూసుకొని.

"ప్రపంచంలో లెక్కలేనన్ని ఫ్యాక్టరీలు ఉండాలి. ఏవంటే అవి తయారు అయిపోతుండాలి. డబ్బులు లేకపోయినా పిల్లలకు కావలసినవన్నీ ఊరికే దొరుకుతుండాలి" అడిగాడు రమేష్.

"భూమి మీద జనాభా ఎక్కువైపోయింది- ఇంతమంది ఉండనక్కర్లేదు. అక్కడొకరూ, అక్కడొకరూ ఉంటే చాలు" అడిగాడు హరి, ఆరోజు ఉదయమే జరిగిన 'జనాభా' పాఠాన్ని గుర్తుచేసుకుంటూ.

"క్రూరమృగాలు ఏవీ అసలు ఉండకూడదు- ప్రమాదాలు అనేవే జరగకూడదు" బాగా ఆలోచించి అడిగాడు బాలు.

"అబ్బ! బలే అడిగారు! ఇట్లాంటి కోరికలు ఇవాల్టి వరకూ ఎవ్వరూ కోరలేదు మమ్మల్ని. మీ ఇష్టప్రకారమే అవుతుంది" అని ఆ వింత మనుషులంతా నవ్వి, మాయమైపోయారు.

మరు క్షణం వాళ్ల చుట్టూ ఉన్న ప్రపంచం మొత్తం వింతగా ఐపోయింది. మనుషులు

ఎక్కడో గాని ఒకరు కనబడట్లేదు. ఎక్కడ చూసినా రోబోలు- మనుషులు చెప్పకనే అన్నీ చేసేస్తున్నాయి. ఎటు చూస్తే అటు ఫ్యాక్టరీలు వచ్చి ఉన్నాయి. అన్నిటిలోనూ టాఫీలు, ఐస్క్రీములు, రకరకాల బొమ్మలు తయారౌతున్నాయి. ఒక్కోసారి ఎవరో పిల్లలు వచ్చి ఏవంటే అవి తీసుకుపోతున్నారు వాటినుండి. అక్కడక్కడా జింకలు, ఆవులు, దూడలు కనిపించి గంతులేస్తున్నాయి.




పిల్లలు నలుగురికీ సందడే సందడి. వాళ్ళు ఆడుకునేందుకు ఎన్నో బొమ్మలు వచ్చి పడి ఉన్నాయి. తినేందుకు చాక్లెట్లు, బిస్కెట్లు, పిప్పరమెంట్లు కుప్పలు కుప్పలుగా ఉన్నాయి.

పెద్ద పెద్ద భవంతులు, అన్నీ ఖాళీగా, వీళ్లకోసమే ఉన్నట్లు ఉన్నాయి. ఎక్కడా హడావిడి లేదు. ఎక్కడా జనసమ్మర్దం లేదు. పిల్లలు నలుగురూ సంతోషంతో పొంగిపోయారు. రోజంతా ఆడుకున్నారు. రాత్రి అయ్యాక వాళ్లకు అమ్మనాన్నలు గుర్తుకొచ్చారు- పిల్లలు గబగబా వాళ్ల ఇళ్ల దగ్గరికి వెళ్ళి చూసారు. ఇళ్ళల్లో మనుషులన్న వాళ్ళు ఎవ్వరూ లేరు! తగ్గిపోయిన జనాభాలో వాళ్ళ కుటుంబాలు కూడా ఉన్నట్లున్నాయి! "యువర్ పేరెంట్స్ ఆర్ నాట్ దేర్. మే ఐ హెల్ప్ యూ గైస్?" అంటూ వచ్చింది ఒక రోబో. వీళ్ళు ఏం చెబితే అది చేసి పెట్టింది.

అట్లా కొన్ని రోజులు గడిచాయి. అంతలో మరి ఎక్కడినుండి వచ్చాయో, అడవి దున్నలు, ఏనుగులు, నీటి గుర్రాలు అన్నీ పట్టణంలోకి వచ్చి తిరగటం మొదలెట్టాయి. కోతులు, మేకలు, గొర్రెలు ఇవన్నీ మనుషులకంటే ఎక్కువ ఐపోయి, దొరికిన

వస్తువునల్లా నాశనం చేసేస్తున్నాయి.




"ఎందుకైందిరా ఇట్లా?" అడిగాడు హరి, ఒక రోబోని

రోబో చెప్పింది "ఇప్పుడు ఈ ప్రపంచంలో క్రూరమృగాలే లేవు. దాంతో గడ్డి మేసే ప్రాణులు ఎక్కువైపోయాయి. వాటన్నిటికీ సరిపడా గడ్డి లేదు; అందుకని అవన్నీ ఊళ్ళలోకి వచ్చేసాయి" అని. చూస్తూ చూస్తూండగానే వీళ్ళు తినేందుకు సహజమైన వస్తువులేమీ దొరకకుండా అయ్యింది. సాధు జంతువులు అన్నిటినీ ఐపోగొడుతున్నాయి!

ఇట్లా మరి కొన్ని రోజులు గడిచేసరికి పిల్లలు నలుగురికీ బుద్ధి వచ్చేసింది. కానీ పాపం, ఇప్పుడు ఏం చేయగలరు?

బాధగా జేబులో చెయ్యిపెట్టుకున్నాడు రమేష్. ముసలి తాత ఇచ్చిన ఐదో విత్తనం చేతికి తగిలింది! అతను ఎగిరి గంతేసి, మిగిలిన ముగ్గురినీ పిలిచి చూపించాడు దాన్ని. విత్తనాన్ని చూడగానే వాళ్లందరి ముఖాలూ వెలిగాయి: "అన్నీ ఇది వరకు ఉన్నవి ఉన్నట్లుగా చేసేయమందాం!" అరిచారు మిత్రులు సంతోషంగా, ఒక్క గొంతుతో.

"మనం తప్పు చేసాం అసలు. మంత్రాలతో పని జరగదు. ప్రకృతిలో అన్నీ ఒకదానిమీద ఒకటి ఆధారపడి ఉన్నై. ఏ ఒక్కటి లేకున్నా, మిగతా ప్రపంచం అంతా గందరగోళం అవుతుంది. ఏ మార్పులు కావాలన్నా మనకు మనమే చేసుకోవాలి, జాగ్రత్తగానూ, ఆలోచించి!" చెప్పాడు ఆసిఫ్.

ఐదో విత్తనాన్ని నాటగానే మొక్కలు, చెట్లు, ఆపైన చెట్టు తొర్రలోంచి వింత మనిషి

వచ్చారు- "మీరు చాలా మంచివాళ్ళు..ఏం కావాలో కోరుకోండి!" అన్నాడు వింతమనిషి.

"ప్రపంచాన్నంతా ఇదివరలో ఎలా ఉందో అట్లా మార్చేయండి! ప్రకృతిని ఇంకా పచ్చగా, వాతావరణాన్ని ఇంకా ఆరోగ్యవంతంగా చేయండి, మనుషుల్నీ, జంతువుల్నీ అన్నిట్నీ ఇదివరకు ఉన్నవాటిని తిరిగి తెప్పించేయండి- వాళ్లందరూ మాకు అవసరమే, ప్లీజ్!" అన్నారు పిల్లలు.

మరుక్షణం ప్రపంచం మొత్తం అంతకు ముందు లాగా ఐపోయింది!

ఇప్పుడు పిల్లలకు నలుగురికీ ప్రపంచాన్ని చూస్తే చాలా సంతోషంగా ఉంది. పచ్చపచ్చని చెట్లు, రకరకాల జంతువులు, వాటి మధ్యలో మనం.. చల్లచల్లని గాలి, మెల్లగా వీస్తూ ఉంటే ఎంత హాయిగా ఉంటుందో!

**తినే పేస్టు!**

లత: మీ టూత్ పేస్టులో ఉప్పు, పుదీన, నిమ్మకాయ, లవంగం, అల్లం ఉన్నాయా...?

మీనా: అవన్నీ ఉంటే దాన్ని టూత్ పేస్ట్ అని ఎందుకు అంటారే ? "చట్నీ" అంటారు గానీ?!

**నేను పర్లేదు!**

తండ్రి: మొన్నటి పరీక్షలో ఎన్ని మార్కులొచ్చాయిరా, నీకు?

కొడుకు: రవి గాడి కంటే నాలుగు మార్కులు తక్కువ వచ్చాయి నాన్నా, అంతే.

తండ్రి: పర్లేదులేరా! ఇంతకీ వాడికి ఎన్ని మార్కులొచ్చాయి?

కొడుకు: నాలుగు!




**రక్షణ కవచం!**

ప్రయాణీకుడు: ఆటో?! స్టేషన్ కి వస్తావా?

ఆటో డ్రైవర్: జోరుగా వర్షం కురుస్తోంది సర్. మీటరుపై ఏదైనా...

కుమార్: సర్లే పద! మీటరు మీద ఈ తువ్వాలు వేసుకో!

సేకరణ: సత్యలక్ష్మి , తొమ్మిదో తరగతి, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, చెన్నేకొత్తపల్లి.



# కల!

*రచన: ఆకర్ష్, 6 వ తరగతి, వికాస విద్యావనం, పోరంకి, కృష్ణా జిల్లా.*

కృష్ణ, రాము ఇద్దరూ స్నేహితులు. ఒక సెలవు రోజున వాళ్ళిద్దరూ అట్లా అట్లా ఆడుకుంటూ ఊరు దాటి పోయారు. బాగా అలసిపోయి, నీళ్ళకోసం, నీడకోసం వెతుక్కున్నారు.

అట్లాంటి సమయంలో ఆ దగ్గర్లోనే ఓ పెద్ద మర్రి చెట్టు కనిపించింది వాళ్లకు. ఆ చెట్టుకి దగ్గర్లోనే ఒక చేదబావి కూడా కనబడింది. చేదబావిలోంచి నీళ్ళు తోడుకొని త్రాగి, వాళ్ళిద్దరూ మెల్లగా చెట్టు నీడన చేరారు. పెద్ద పెద్ద ఊడల్ని క్రిందికి జార్చి గట్టిగా నిలబడి ఉన్నదది. ఆ చల్లదనానికి, అక్కడి వాతావరణానికి ఇద్దరి మనసులూ ప్రశాంతంగా అయిపోయినై. ఎవరికి వాళ్ళుగా ఇద్దరూ ఓ చిన్న కునుకు కూడా తీసారు.

అంతలోనే వాళ్ళకి దగ్గర్లోనే, పొదల మరుగున, పాత బంగళా ఒకటి కనపడింది:

"ఒరేయ్! అదిగో చూడు! అక్కడ! బలే ఉంది!" అన్నాడు కృష్ణ.

కృష్ణ అటువైపు చూసి ఆశ్చర్యపోయాడు- "దీన్ని ఇంతకు ముందు ఎప్పుడూ చూడనే లేదే?"అని.



ఇద్దరూ అటుగా నడిచారు.

బంగళాకి పోయే దారి బాగా పాడైంది. చెట్లు, తుప్పలు, ముళ్ళపొదలు అడ్డదిడ్డంగా పెరిగి ఉన్నాయి. సాలీళ్ళు పెట్టిన గూళ్ళున్నాయి ఎక్కడికక్కడ. వాటిని అన్నిటినీ తప్పించుకుంటూ ముందుకు సాగారు మిత్రులిద్దరూ. మెల్లగా బంగళాకు చేరుకున్నారు.

"హెల్లో! ఎవరైనా ఉన్నారా, ఇక్కడ?" అరిచాడు రాము.

"హెల్లో! ఎవరైనా ఉన్నారా, ఇక్కడ?" అన్నది ఖాలీ బంగళా.

"ఎవ్వరూ లేరులే! గేటుమీది దుమ్ము-దుశానం, సాలీడు గూళ్ళే దానికి గుర్తు" నవ్వాడు కృష్ణ.

"..దానికి గుర్తు" అని నవ్వింది బంగళా.

"కానీ ఇక్కడికొచ్చే దారిలో అన్నీ పాము వదిలిన పొలుసులే ఉన్నై!" అన్నాడు రాము భయంగా.

"..పొలుసులే ఉన్నై" అంది బంగళా.

అప్పుడు గానీ గమనించలేదు కృష్ణ. నిజమే.. అక్కడ అంతా చెదురుమదురుగా పాము కుబుసాలు పడి ఉన్నై.

"పాములేవో ఉన్నట్లున్నై. జాగ్రత్త!" అంటూ ముందుకు నడిచాడతను.

మెల్లగా ఇద్దరూ బంగళాలోపలికి పోయి చూసారు- ఎవరైనా ఉన్నారేమో అని. ఎక్కడా ఎవ్వరూ కానరాలేదు.

"సరేలే, పోదాం, ఇంక తిరిగింది చాలు" అనుకున్నారు మిత్రులిద్దరూ. అలా

అనుకున్నారో లేదో, వాళ్ళున్న గది తలుపులు మూసుకున్నాయి.

ఇద్దరూ కంగారుగా తలుపులు బాదారు. గది అంతా తిరిగారు. ఎక్కడా బయటికి వెళ్ళే మార్గం లేదు!

అంతలోనే అక్కడ వాళ్ళకో పాము కనబడింది! అది కదలకుండా వాళ్లనే చూస్తున్నది! వాళ్ళు ఎంత బెదిరించినా అది మటుకు కదల్లేదు.

చివరికి "నువ్వేనా తలుపులు వేసింది?" అడిగాడు రాము, ఆ పాముని.

పాము తల ఊపింది.

"ఎందుకు?"

పాము చటుక్కున ఒక తలుపు క్రిందినుండి దూరి అవతలికి వెళ్ళింది.

మిత్రులిద్దరూ పోయి చూస్తే ఆ తలుపు తీసే ఉంది!

ఇద్దరూ తలుపు తీసుకొని లోనికి అడుగు పెట్టారు. అది వంటగది లాగా ఉంది. ఎటుచూసినా బూజు. కొంచెం అవతలగా నిలబడి ఉంది పాము. వీళ్లనే చూస్తూ.

"ఏం చేయమంటావు?"



పాము అటు ప్రక్కగా ఉన్న ఓ బిందెకేసి చూపించింది.

చూస్తే ఆ బిందెలో నీళ్ళున్నై. "ఏం చేయమంటోంది?" అడిగాడు కృష్ణ ఆదుర్దాగా.

"మీద పొయ్యమంటావా?" అడిగాడు రాము, పాముని.

తల ఆడించింది పాము.

వెంటనే కృష్ణ, రాము ఇద్దరూ ఆ నీళ్ళని

పాము మీద పోసారు.

వెంటనే పాము కాస్తా ఒక అందమైన అమ్మాయిగా మారిపోయింది!

కృష్ణకి ఆ అమ్మాయి చాలా నచ్చింది. "బలే ఉంది. కానీ భయం కూడా వేస్తోంది" అన్నాడు.

"ఏమైంది?! ఏమైంది?" ఎవరో అమ్మాయి.

"పాము!! నువ్వు పామువు కదా!" అన్నాడు కృష్ణ.

మరుక్షణం వాళ్ల ముఖాలమీద బిందెడు నీళ్ళు కుమ్మరించ బడ్డాయి. మిత్రులిద్దరూ కళ్ళు తెరిచి చూసి, చాలా సిగ్గుపడ్డారు.

వాళ్ళిద్దరూ ఇంకా మర్రిచెట్టు క్రిందనే ఉన్నారు. ఎదురుగుండా ఒకమ్మాయి నిలబడి ఉంది, చేతిలో ఖాళీ బిందెతో. "మీరు ఎంతకీ లేవకపోతే మీకు ఏమైనా అయ్యిందేమో అనుకున్నాను. ఇళ్ళు, పనులు వదిలి ఇంత దూరం వస్తారా, పిల్లలు ఎవరైనా? సాయంత్రం అయిపోయింది- ముందు ఇంటికి నడవండి!" అంటోంది.



**పద్ధతి మారాలి!**

టీచర్: న్యూటన్ చెట్టు కింద కూర్చుని గురుత్వాకర్షణ శక్తిని కనిపెట్టాడు. దీన్ని బట్టి నీకు ఏమి అర్థం అవుతోంది మురళీ?

మురళి: ఇలా క్లాసులో కూర్చుంటే కొత్త విషయాలు కనిపెట్టలేమని తెలిసింది టీచర్!

**సమయోపయోగి!**

తల్లి: గంట నుంచీ ఏమీ చేయకుండా అలా ఆలోచిస్తున్నావు- ఎందుకురా, బిట్టూ?!

బిట్టు: సమయాన్ని వృథా చేయకుండా ఎలా ఉండాలి?' అని ఆలోచిస్తున్నామ్మా!

**కష్టజీవి!**

భార్య: ఇక్కడో లైఫ్ బాయ్ సబ్బు పెట్టాను, మీకేమైనా కనిపించిందాండి?

భర్త: ఓ. మా బాగా కనిపించింది. అయితే ఆరోగ్యానికి మంచిదని టీవీలో చెబితే, కష్టపడి తినేశా!!



# చాకలి-గాడిద

*సేకరణ: ప్రణుతి, 5 వ తరగతి, వికాస విద్యావనం,పోరంకి, కృష్ణాజిల్లా.*

*చిత్రాలు: లిఖిత్, రాధ స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం*



ఒక ఊళ్ళో ఒక చాకలాయన ఉండేవాడు.

ఆయన పేరు సాంబయ్య. సాంబయ్యకు పనిలో సాయంగా ఒక గాడిద ఉండేది.

రోజూ ఊళ్ళో వాళ్ల బట్టలను అన్నింటినీ సేకరించుకొని, వంక దగ్గరికి వెళ్ళి, ఆ బట్టలు ఉతుక్కొచ్చేవాడు సాంబయ్య. ఆ బట్టల బరువును మోయటం ఈ గాడిద పని.

అట్లా ఒకరోజున బట్టలు ఉతికి, వెనక్కి తిరిగి

చూసిన సాంబయ్యకు తన గాడిద కనిపించలేదు. "ఇక్కడే కట్టేసానే?! ఎటుపోయింది?" అని అడవంతా వెతికాడతను. ఎక్కడా గాడిద జాడ లేదు.

"ఎవరో ఎత్తుకుపోయి ఉండాలి. లేకపోతే తనంతట తాను ఎక్కడికీ పోదు, పాపం నా గాడిద!" అని అతనికి చాలా బాధ వేసింది.

ఊళ్ళో కనిపించిన వాళ్లనల్లా అడిగాడు- "నా గాడిద కనపడట్లేదు ఎవరైనా చూసారా?" అని.

"మేం చూడలేదు- మేం చూడలేదు" అన్నారు అందరూ.

మరునాటికల్లా సాంబయ్యకు కోపం వచ్చేసింది. "గాడిద లేకపోతే బట్టల మూటలు ఎవరు మోస్తారు?" అని.

అప్పుడు ఇక తన భాష మార్చాడు: కనబడిన వాళ్లతోనల్లా "ఇదిగో! మీరెవరైనా నా గాడిదను చూసి ఉంటే మర్యాదగా ఇప్పుడే ఇచ్చెయ్యండి, చెబుతున్నాను. లేకపోతే మా తాత ఏం చేసాడో అదే నేనూ చేస్తాను! తర్వాత మీ యిష్టం మరి!" అనటం మొదలు పెట్టాడు.

ఊళ్ళోవాళ్ళు చాలా మంది "నిజంగా నేను తీసుకోలేదు సాంబయ్యా! నన్ను నమ్ము!" అని చెప్పాల్సి వచ్చింది సాంబయ్యకు.

అయితే నిజంగా గాడిదను దొంగిలించింది ఆ ఊరివాడే, ఒకడు.



"వాళ్ళ తాత చేసినట్లే చేస్తాడట తనుకూడా!' అని ఆ దొంగకు చాలా భయం వేసింది. మరో రెండు రోజులు గడిచే సరికి అతను ఇక తట్టుకోలేకపోయాడు. "ఏం చేస్తాడో, మరి! ఊరికే ఎందుకు తంటాలు?!" అని

అతను భయ పడుతూనే సాంబయ్య దగ్గరకు వచ్చి, "నీ గాడిదను నేనే దొంగిలించాను- నన్ను క్షమించు సాంబయ్యా! ఇదిగో నీ గాడిద!" అని గాడిదను తిరిగి అప్పగించేసాడు !

తన గాడిద తనకు చిక్కినందుకు సంబరపడిన సాంబయ్య అతన్ని ఇంక ఏమీ అనలేదు.

దొంగ వెను తిరిగి పోబోతూ సాంబయ్యతో "సాంబయ్యా! నేను వెనక్కి తెచ్చి ఇచ్చా కాబట్టి సరిపోయిందనుకో! కానీ ఒక వేళ నేను నీకు గాడిదను తెచ్చి ఇవ్వకుంటే ఏం చేసేవాడివి?" అని అడిగాడు.

"ఏం చేసే వాడిని? ఇంకో కొత్త గాడిదను కొనుక్కునే వాడిని!" అన్నాడు సాంబయ్య "అప్పట్లో మా తాత అదే పని చేసాడు పాపం!"

అది విన్న దొంగకు నిజంగా తిక్క తిరిగింది!

సౌజన్యం: డా. పత్తిపాక మోహన్ గారి "పిల్లల కోసం పొడుపు కథలు" :



1.అడపానికి అరతిత్తు, పగడానికి బొక్కెడు నెత్తురు ఏంటది?

2.అడవిలో ఓ చెట్టుకు భార్యా బిడ్డల పేర్లుంటాయి. ఏచెట్టది?

3.అడవిలో ఆంబోతు రంకెవేస్తే మాన్లు విరిగె. ఏ ఆంబోతు?

4.అడవిలో అంటా సీతమ్మ ముగ్గులు. ఏ ముగ్గవ్వా?!

5.అడవిలో పెట్టని దీపం, వెలుగునిచ్చు అడవి అంతా?!

జవాబులు: 1.కుంకుమ 2.విష్ణుకాంత 3.గొడ్డలి 4.చీమలబారు 5.వెన్నెల

# బొమ్మకు కథ రాయండి

*ఇప్పుడే తెల్లవారినట్లుంది.. లేకపోతే మరి అడవి తగలబడుతోందో? వీళ్ళెవరో అన్నా చెల్లెళ్ళ లాగున్నారు కదా? స్కూల్ నుండి నేరుగా అడవికి ఎందుకెళ్ళిపోయారో మరి?! ఈ ఏనుగులు రెండూ వాళ్లకి దొరికాయా, లేకపోతే వాళ్ళే ఈ ఏనుగులకు దొరికారా? ఇద్దరూ తప్పిపోతే ఏనుగులు కాపాడి వెనక్కి తెస్తున్నాయేమో? లేకపోతే వాటినే వీళ్ళిద్దరూ అడవిలో వదిలేందుకు బయలు దేరారా? ఆ ముచ్చట్లతో ఓ చక్కని కథ రాసి పంపండి మరి! కథ బాగుంటే కొత్తపల్లి-103 లో ప్రచురిస్తాం!*



కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, MRO ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి , అనంతపురము జిల్లా, ఆంధ్రప్రదేశ్-515101.




# ప్రత్యుపకారం

*"మన చుట్టూ ఎన్నో జీవులు సహ జీవనం చేస్తున్నాయి. అవి ఏవో, వాటి జీవన విధానం ఎలాంటిదో! వాటిని గురించి మనకు సరియైన అవగాహన లేనే లేదు. అయినా అట్లాంటి ప్రాణులకు మనం చేసే ఉపకారం ఏదో రూపంలో, మరో విధంగా కష్టాల్లో మనకు తిరిగి తప్పక అందుతుంది. అది అప్పటికప్పుడే అట్లే జరగాలని ఏమీ లేదు. నమ్మకానికి మించిన దైవం లేదు. ఆ విశ్వాసమే జీవులను నడిపిస్తుంది. అదే సర్వ జీవులకు రక్షణకవచమై నిలుస్తుంది" అంటున్నారు ఈ తాతగారు.*

*రచన: శ్రీ చొప్పా వీరభద్రప్ప, అనంతపురం.*

*చిత్రాలు: పి.అరవింద్,9 వ తరగతి, రాధా స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం.*

పులిచెర్లలో గంగయ్య అనే తాపీ పనివాడు ఉండేవాడు. అతను ప్రతిరోజూ పట్నం వెళ్ళి పనిసేవాడు. ఆ వచ్చిన డబ్బుతో ఇంటికి కావలసిన బియ్యమో, రాగి-జొన్నలో కొనుక్కుని, కాలినడకన ఊరికి తిరిగి వచ్చేవాడు.

అతను వచ్చే దారిలోనే, ఊరికి దగ్గరగా పెద్ద జువ్వి చెట్టు ఒకటి ఉండేది. ఆ చెట్టు కింద ఓ పెద్ద చీమల పుట్ట ఉండేది. గంగయ్య ప్రతిరోజూ ఆ పుట్ట దగ్గర ఆగేవాడు. తను తెచ్చుకున్న ధాన్యపు మూటని విప్పి, ఒక చారెడు ధాన్యం తీసి, ఆ పుట్ట చుట్టూ పోసి ఆనక మెల్లగా నడచుకుంటూ ఇంటికి పోయేవాడు.



అది చూసి కొందరు నవ్వుకునేవాళ్ళు: "వీనికి ఇదేమి పిచ్చి?! తను ఏమైనా దానకర్ణుడ-నుకుంటున్నాడో ఏమో. ఇతనికే ఏమీ లేదు కదా, తినేందుకు?! అయినా కష్టపడి సంపాదించిన సొమ్మును ఇంటికి తీసుకుపోయి దాచుకోక, నేలపాలు చేస్తాడు. తిక్కే, వీడికి!" అని అనుకునేవాళ్ళు.

తనని ఎవరు ఎన్ని మాటలన్నా, గంగయ్య మటుకు వారి మాటల్ని చెవికి ఎక్కించు-కునేవాడు కాదు. కాలం గడిచే కొద్దీ ఆ చెట్టు కాస్తా జనాల భాషలో 'గంగయ్య జువ్వి చెట్టు' అయ్యింది. చీమలు అతడిని గుర్తించినాయో లేదో గాని, అతడు మాత్రం చీమలకు గింజలు వెయ్యని దినమే లేదు.

అలా ఉండగా ఆ ప్రాంతంలో క్రమంగా వర్షాలు తగ్గిపోసాగినై. ఒక ఏడాదైతే అక్కడి నేల మొత్తం బీటలు వారింది; చుట్టుపక్కల ఉన్న చెరువులు, కుంటలు అన్నీ ఎండిపోయాయి! భూమిలో తేమ తగ్గిపోయింది. జువ్విచెట్టుకు కూడా నీరు చాల లేదు. అందుకని అది తన కొమ్మలకు, రెమ్మలకు నీటి సరఫరా తగ్గించింది. దానితో చిన్న చిన్న కొమ్మలు అన్నీ ఎండిపోసాగినై. క్రమంగా ఆ చెట్టును ఆశ్రయించి నివాసం ఉంటున్న పక్షులు కూడా వలస పోసాగాయి!

గ్రామంలో జనాలంతా వాడుకొన్న నీళ్ళు

పోయేందుకు ఓ మురికి కాలువ ఉండేది. అది గంగయ్య జువ్వి చెట్టుకు కొంత దూరంనుండే పోతుండేది. మరి ఈ చీమలకు ఆలోచన ఎట్లా వచ్చిందో ఏమోగాని, చెట్టు చుట్టు ప్రక్కల ఉన్న నేలను అంతా గుల్ల బార్చాయి. మురికి కాలువ వరకూ నేలకు చిన్న చిన్న రంధ్రాలు వేసి దారులు ఏర్పరచాయి.

చూస్తూ చూస్తూండగానే మురికి కాలువల్లోని తేమ ఈ దారులను అంటుకున్నది. నెమ్మదిగా చెట్టు దగ్గరి వరకూ వచ్చి చేరింది. ఆ సంగతి తెలియగానే జువ్వి చెట్టు నులివేళ్ళు ఆ వైపుకు సాగాయి. తేమను అందిన జువ్వి చెట్టుకు ప్రాణం లేచి వచ్చినట్లయింది. త్వరలోనే అది మళ్ళీ పచ్చగా అయ్యింది. అంతకు ముందున్న రూపాన్ని సంతరించుకుంది. వలసపోయిన పక్షులు కూడా తిరిగి తమ గూళ్లలోకి చేరుకున్నాయి ఆనందంగా.

చెట్టు చీమలనడగలేదు.

చీమలు చెట్టుకు చెప్పలేదు.

పక్షులు చెట్టుకు చెప్పిపోలేదు.

అవి తిరిగి చెట్టునడిగి రాలేదు.

ప్రకృతి ఎవరి ప్రమేయమూ లేకుండా తనపని తాను సాగిస్తూనే ఉంటుంది. జీవుల మధ్య అవినాభావ సంబంధం అర్థం కానిది.




తర్వాత కొన్నేళ్లకు ఒకసారి ప్రకృతి మళ్ళీ వికటించింది. ఈసారి చిన్న గాలితో మొదలై, ఓ మోస్తరు వానగా మారి, చివరికి అదే కుండపోత వర్షమై, మన్ను మిన్ను ఏకమైనట్లు కురవసాగింది వాన!

గంగయ్య ఇల్లు ఊరికి కొంచెం ఎడంగా ఉండేది. ఎండిన వాగు ప్రక్కనే, ఓ రాళ్ళగుట్టకు దగ్గరగా ఉండేది అతని ఇల్లు.

అక్కడ అతనితో బాటు మరో మూడు నాలుగు ఇళ్ళు ఉండేవి అంతే.

కొద్ది సేపటికి వంకల నీళ్ళు అన్నీ చేరుకునే సరికి, వాగులో ప్రవాహం మొదలైంది. దాంతో కాలనీవాసులకు అందరికీ భయం వేసింది. అందరూ తమ తమ ఇళ్ళు వదిలి దూరంగా పోయి, ఎత్తైన ప్రాంతాల్లో తల దాచుకున్నారు.



గంగయ్యకు ఎందుకనో భయం అనిపించలేదు. వేరే ఎక్కడికో పోయి ప్రాణాలు కాపాడుకోవాలని కూడా అనిపించలేదు. పొంగుతున్న వాగుని, వానలో తడుస్తున్న జువ్వి చెట్టుని చూస్తూ అతను అక్కడే కూర్చున్నాడు.

రాను రాను ప్రవాహ ఉధృతి పెరిగింది. మెల్లగా గంగయ్య ఇంటి వైపు నేల కోతకు గురవ్వసాగింది. ఆ సరికే వంకలోకి రకరకాల వస్తువులు కొట్టుకొచ్చినై. గ్రామంలోకి నీళ్ళు వచ్చేసాయి. చాలామంది ఇళ్ళలోని వస్తువులు నీళ్ళపై తేలుతున్నాయి. ఇక మిగిలింది గంగయ్య ఇల్లు ఒక్కటే. "అది కూడా కూలిపోతుంది..మొత్తం వంకలో పడి కొట్టుకొని పోతుంది- ఖాయం" అనుకున్నారు అందరూ.

అదేమి చిత్రమో గాని, అప్పటికప్పుడు పెద్ద బండరాయి ఒకటి గుట్ట పైనుండి జారి పడింది. ఆ శబ్దానికి అందరూ భూకంపం వచ్చిందేమో అన్నట్లు ఉలిక్కిపడ్డారు. పడటం పడటం అది వంకలో పడింది! ప్రవాహ వేగానికి అడ్డంగా దొర్లుకొని, గంగయ్య ఇంటి పునాదిని ఆనుకొని నిలబడింది. ఆ ఒక్క బండ అడ్డు ఉన్నందువల్లనే నీటి ప్రవాహపు దారి మళ్ళింది. వాగు మొత్తం అవతలి ఒడ్డును ఒరుసుకొని పారింది!

వర్షం నిలిచి వాతావరణం శాంతించేందుకు వారం రోజులు పట్టింది. చూడగా గంగయ్య ఇంటి పునాది ఏమాత్రం కోత పడలేదు. ఇల్లు చెక్కుచెదరలేదు. గంగయ్య తిరిగివచ్చి తన అదృష్టాన్ని తానే నమ్మలేకపోయాడు.

గంగయ్య చీమలకు ఆహారం అందించి-నందుకు ప్రతి ఫలంగా ఏ దేవుడో వచ్చి అతనికి సాయం అందిస్తారు అనుకున్నారు కదూ?! ఈ కథలో అట్లా జరగలేదు. మనం మానవతతో, ప్రతిఫలాన్ని ఆశించకుండా, 'తోటివారికి సాయం చేయటం మన కర్తవ్యం కదా' అనుకొని పని చేస్తూ పోతే, ఏదో ఒకనాడు- ఎప్పుడో ఒకప్పుడు- ఎవరో ఒకరు తోడుగా నిలచి, మనకు సాయం అందిస్తారు. ఇది సున్నితమైన ధర్మం.

గంగయ్య తనకు తెలీయకుండా చీమలకు సాయమందించాడు. ఆ సాయం ఊరికే పోలేదు. అది మరోరూపంలో అతనికి సాయంగా అందింది. ఇతరులకు చేసే సాయం ఏనాటికీ వృథా పోదు!!

సౌజన్యం: డా. పత్తిపాక మోహన్ గారి "పిల్లల కోసం పొడుపు కథలు"

1. అక్కడకు పచ్చని చిలుకలొస్తాయి, కొంటారు, తింటారు, అంగడిలో అమ్ముతారు.

2. అంకటి బంకటి కూర, తిన తియ్యగున్నది, ఇంత పెట్టు!



3. అంక పొంకలు లేనిది, అదలక మెదలక ఉంటది.

4. అక్క ఇంట్ల కూచోని చెల్లె ఇంట్లకు పోతది

5. అంగట్లో ఖంగురాయి, ఇడుస్తే దొరకదు

జవాబులు: 1.అనాసపండు 2.మీగడ 3.శివలింగం 4.పొయ్యి మీద కుండ 5.పిత్తు



# కుడిభుజం

*రచన, చిత్రాలు: కె.ద్వారకానాథ్, తిరుపతి.*

కొండమింది పల్లెకు దగ్గరలో కేసరివనారణ్యం అని ఒక అడవి ఉండేది. ఆ అడవిలో లెక్క లేనన్ని జంతువులు నివసించేవి. శూరసింగ్ సింహం ఆ అడవికి రాజు. ఆయనకు కుడిభుజం, చాణక్య మంత్రి అనే నక్క. తన నమ్మకాన్ని, మిత్రుడి స్నేహాన్ని ఆధారంగా చేసుకుని, అడవిలో అందరి మంచి చెడ్డలనూ చూసుకునేది సింహం.

మాసంలో రెండు రోజులు చాణక్య మంత్రి మారువేషంలో పోయి అడవి అంతా తిరిగి వచ్చేది. అడవిలో సంగతులన్నీ రాజుగారికి విశేషాలు చేరవేసేది.

ఒకసారి చాణక్యమంత్రి ఆ పనిమీద పోయిన సమయంలో, శూరసింగ్‌కి ఏదో అనారో-గ్యమైంది. అది తన గుహను వదిలి ఆ రెండు రోజులూ బయటికి రాలేదు.

దాంతో జంతులోకంలో కొంత గందరగోళమైంది. అంతలో చాణక్యమంత్రి తిరిగి వచ్చి, హుటాహుటిన రాజుగారిని చూడబోయింది.

మూసిన కళ్ళు తెరవకుండా జ్వరంతో పడుకుని ఉన్నాడు శూరసింగ్. చాణక్య మంత్రి రాజుకు ధైర్యం చెప్పి "మన ఆస్థాన వైద్యుడు ఎలుగుబంటి సంజీవయ్యను తీసుకువస్తాను" అని బయలుదేరింది.



వైద్యుడు సంజీవయ్య రాజుగారిని పరీక్షించి, "ఏమీ పర్వాలేదు. మామూలు జ్వరమే. తగ్గిపోతుంది" అంటూ గుహ బయటికి పోయి కొన్ని రకాల ఆకులు తెచ్చి నూరింది. వాటి రసాన్ని తాను తెచ్చిన చిన్న ముంతలో పోసి ఇచ్చి "దీన్ని బాదాం ఆకులో పోసి మూడు పూటలా నాకించండి. జ్వరం తగ్గిపోతుంది. భయపడాల్సిన పనిలేదు. ఒక్క ఐదు రోజులు విశ్రాంతి తీసుకుంటే చాలు. ఇక నేను వెళ్ళివస్తాను" అన్నది. చాణక్య మంత్రి సంజీవయ్యకు కృతజ్ఞతలు తెలిపి, గౌరవించి పంపించింది.

ఎన్నాళ్ళ నుండో అడవికి రాజు కావాలన్న ఆశతో ఉన్న తంత్రీపాలుడు అనే పులికి తెలిసింది ఈ సంగతి. "శూరసింగ్ ఆరోగ్యంగా ఉన్నప్పుడు నేను వాడిని ఏమీ చేయలేను. అయితే ఇప్పుడు మంచి సమయం. ఈ అవకాశాన్ని ఉపయోగిం-చుకోవాలి" అనుకున్నదది.

రాజ్యాన్ని చక్కబెడుతూ బిజీగా ఉన్న మంత్రి చాణక్యుడిని కలిసి, ముందు కొద్ది సేపు ఆమాటా, ఈమాటా కలిపింది. రాజుగారికి ఆరోగ్యం బాగా లేదని తెలిసి బాధ పడుతున్నట్లు నటించింది. అటుపైన గొంతు తగ్గించి ఇప్పుడు కొంచెం మెల్లగా గర్జిస్తూ, "మహామంత్రి గారూ! మీరు ఏమీ అనుకోనంటే, మరి- నేను నా మనసులో మాట బయట పెడతాను... చూడండి, నేను

కూడా మీ రాజులాగానే వేటాడగలను; నాకు కూడా పంజా విసరటం వచ్చు; నాకు కూడా కోర దంతాలు ఉన్నాయి..ఏమంటే మీ రాజుగారికి గడ్డం ఉంది, నాకు లేదు- అంతే కదా తేడా?! మిగతావన్నీ అచ్చం మీ రాజులాగానే.... ఆ!... ఏమంటారు?" అని వికవికా నవ్వింది.

మంత్రి చాణక్య ఒక్క క్షణం ఖంగుతిన్నది అంతే. ఆ వెంటనే దాని కళ్ళలో ఏదో మెరుపు వచ్చింది. అది చటుక్కున తంత్రీపాలుణ్ణి పక్కకు లాగుతూ, తనూ గొంతు తగ్గించింది- "మెల్లగా మాట్లాడు. గోడలకు చెవులుంటాయి. మన మాటలు ఎవరైనా వింటారు. నేను చెప్పినట్లు చెయ్యి. నేను రాత్రంతా ఆలోచించి, మనం ఏం చేస్తే ఎవరికీ తెలియకుండా పని జరిగిపోతుందో చెప్తాను నీకు. రేపు సాయంత్రం ఊరి పొలిమేర దగ్గర కలుద్దాం. నేను మాత్రం శక్తిలేని ఈ ముసలి రాజుతో ఎన్నాళ్ళని వేగుతాను?" అన్నది గుసగుసగా.

"ఊరి పొలిమేర వరకూ పోవటం ఎందుకు?! ఇక్కడే మాట్లాడుకుంటే పోలా?!" అన్నది తంత్రీపాలుడు మూర్ఖంగా. దానికి గుసగుసగా మాట్లాడటం రాదు. అన్నిటికీ గర్జనే!

నక్క దానికి అడ్డు చెప్తూ "అందుకే! నువ్వు ఇన్నాళ్ళూ రాజువి ఎందుకు కాలేదో నీ మాటలు వింటే అర్థం అయిపోతోంది. ఇలాంటి విషయాల్ని ఊరి పొలిమేర దగ్గరే మాట్లాడుకోవాలి.. తెలుసుకో! పద..పద! వర్షం కూడా వచ్చేటట్లు ఉంది!" అంటూ పులిని పంపించేసింది.



మరునాడు పొలిమేరలో కలిసారు ఇద్దరూ.

"ఏమి ఆలోచించావ్.." అడిగాడు తంత్రీపాలుడు.

చాణక్య నక్క చిన్నగా నవ్వింది- "ఏముంది, అన్ని విధాలుగానూ ఆలోచించా. ఇదే మంచి తరుణం. రాజు ప్రస్తుతం జబ్బుతో ఉన్నాడు. కనుక..., సంజీవయ్య ఇచ్చిన ఆకు పసరును మార్చి, మనం వేరొకటి ఏదో ఇస్తాం.. అటు రాజు హతం.. ఇటు మీకు రాజపదవి!" అన్నది.

"శభాష్..! భలే ఆలోచన" అని మురిసింది పులి.

ఇంతలో దూరంగా మేకల గుంపుల్ని తోలుకుపోతున్న కాపరులు కనపడ్డారు వాళ్ళకు. చాణక్య మంత్రి కాపరులకేసి చూపిస్తూ, "నేను వీళ్లను ఎదుర్కొనలేను గానీ, వీళ్లంతా ఇష్టంగా తినే మేక మాంసం అంటే మటుకు చాలా ఆశ నాకు! దాన్ని తినాలని నా చిన్నప్పటి నుండీ ఎదురు చూపులే!" అన్నది.

"నువ్వు నాకు ఇంత సాయం చేస్తున్నందుకు నేను ఈమాత్రం చేయలేనా.. ఇప్పుడే వెళ్ళి వాటిని వేటాడి మాంసం తెస్తాను" అన్నది పులి.

నక్క దానికేసి చూసి తిరస్కారంగా నవ్వింది. "అన్నింటా నీకు ఆవేశంఎక్కువ, ఆలోచన తక్కువ లాగా ఉందే! అందుకే మరి, నువ్వు ఇన్నేళ్ళూ రాజువి కాలేకపోయావు.

ముందు నేను చెప్పినట్లు చెయ్యి! అక్కడ కనబడుతున్న రాళ్ళ వరకూ వెళ్ళి, చుట్టూ చూసి రా! ఆ తర్వాత ఏం చేయాలో నేను చెప్తాను!" అన్నది.



"అబ్బ! నాకు మండుతున్నది!" అనుకొని, "అయినా వీడి మాటలు వినక తప్పదు- ఏం చేస్తాం" అని గుట్టమీదికంతా పోయి నక్క చెప్పినట్టుగా చుట్టూ చూసి వచ్చింది పులి. అది తిరిగి రాగానే "ఏం చూశావ్?!" అన్నది నక్క

"ఏముందీ, బురద తొక్కుకుంటూ పోయా! పోయి ఊరికే పొలాలు, చెట్లు, గుట్టలు చూసొచ్చా..!" అన్నాడు తంత్రీపాలుడు చికాకుగా.

అప్పుడు చాణక్య నక్క "అందుకే! మరి నువ్వు ఇన్నాళ్ళుగా రాజువి కాలేకపోయింది! అక్కడ అంతమంది కాపరులు మేకల్ని తోలుకుని ఇళ్ళకు పోవడం నీకు కనిపించనే లేదా?! ఇప్పుడు వేటాడడానికి వెళ్తావా? వెళ్తే వాళ్లంతా కలిసి మనల్ని పట్టుకుని చంపెయ్యరా? ఆమాత్రం ఆలోచన లేదేమి?" అని కసిరింది.

"ఒక పని చెయ్యండి! తమరు రేపు మధ్యాహ్నం వేళకు రండి, ఇక్కడికి. ఆ సమయానికి కాపరులు అలిసిపోయి, అన్నం తిని, కునికిపాట్లు పడుతూంటారు. ఆ సమయంలోనైతే తమరు నిశ్చింతగా వేటాడవచ్చు; ఇటు నా కోరికా తీర్చవచ్చు. ఏమంటారు? .. కాబోయే రాజుగారూ...!" అనగానే తంత్రిపాలుడు పొంగిపోయి, "సరే సరే" అని పాటలు పాడుకుంటూ అడవిలోకి దూరాడు.

మర్నాడు తెల్లవారుజామున ఎప్పటిలాగానే పొలం పనులకు బయలుదేరారు రైతులు, మేకల కాపరులు. దారిలో అక్కడంతా బురదలో పులి అడుగులు కనిపించినై వాళ్లకి. వాళ్ళు వాటిని గుర్తించి "ఒరేయ్! రాత్రి మన పల్లెలోకి పులి వచ్చినట్లుందిరోయ్! ఇప్పుడే పోయి గ్రామాధికారికి చెప్పాలి! లేకపోతే ఇంక మనం లేం!" అని వెనక్కి పరుగు పెట్టారు.

ఆ వెంటనే గ్రామాధికారి అక్కడికి వచ్చి చూసి, "నిజమే! ఇది మళ్ళీ వస్తుంది!" అని మాంసం ఉంచిన బోనును ఒకదాన్ని ఊరి పొలిమేరల్లో ఏర్పాటు చేయించాడు.

అనుకున్నట్లుగానే ఆ రోజు మధ్యాహ్నానికి నక్క, పులి వచ్చాయి అక్కడికి. బుర్ర తక్కువ తంత్రీపాలుడి ముక్కు పుటాలకు మాంసం వాసన తగిలేసరికి, ఇక అది ఉండబట్టలేక పోయింది. నక్క ఎంత వారిస్తున్నా వినకుండా అది పరుగు పరుగున

పోయింది, బోనులోని మాంసం తినేందుకు.

అంతలోనే బోను తలుపు మూసుకున్నది; అది ఆ బోనులో ఇరుక్కుపోయింది. గర్జిస్తూ, గింజుకుంటూ అది చాణక్య నక్క ఉండిన దిక్కుకు చూసింది.



కానీ నక్క ఇప్పుడు అక్కడ ఉంటేగా?

"మా మహారాజుకు మంత్రిని! కుడి భుజాన్ని! నమ్మిన బంటుని! నాతో పెట్టుకుంటావా?!" అని నవ్వుకుంటూ అడవి వైపుకు సాగిపోతున్న ఆ నక్క వీపు మటుకు కనపడింది దానికి!

అధికారులు తంత్రీపాలుడిని పట్నంలోని జంతు ప్రదర్శనశాలకు పంపించివేశారు.

అడవి అంతా హాయిగా తిరుక్కుంటూ, అనుకున్నది తింటూ, స్వేచ్ఛగా బ్రతికిన పులి, ఇప్పుడు తన అత్యాశ పుణ్యాన మనుషులకు చిక్కి, వాళ్ళు పెట్టింది తింటూ, వచ్చే పోయే మనుషులను ఆశగా చూస్తూ కాలం గడిపింది!

ఎంత దుర్దశ!!

**స్వాగతం!**

కొత్తపల్లిలో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు కూడా చాలా మంది పిల్లలే! అనంతపురం రాధాస్కూల్‌లో చదువుతున్నారు వాళ్ళు.

పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళ సృజనని దిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. సాయం చేయండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం!




# మర్రి చెట్టు-గడ్డి పోస

*మహారాష్ట్రలో పల్లె పల్లెనా పాడుకునే అభంగ్‌లు రాసిన మహాత్ముడు'సంత్ తుకారాం' 'వినయం' గురించి ఆయన చెప్పిన ఈ కథ, చాలా బాగుంటుంది.*

*కథనం: అఖిలాశ, ఫోను:* 7259511956, *బెంగళూరు.*

అనగనగా ఒక నది ఒడ్డున పెద్ద మర్రిచెట్టు ఒకటి ఉండేదట. లెక్కలేనన్ని కొమ్మలతో ఘనంగా విస్తరించి ఉండేదట ఆ చెట్టు. అయితే దానికి గర్వం ఎక్కువ. "నేను చూడు, ఎంత పెద్దదాన్నో! వయసులోనూ పెద్దనే; విస్తృతిలోనూ పెద్దనే! నేనే అందరికంటే గొప్పదాన్ని" అనుకుంటూ ఉండేది.

రోజూ నది ఒడ్డున పెరిగే చిన్న చిన్న మొక్కలకు అది వినయం గురించి చెప్పేది. "మీరు నాకు రోజూ తల వంచి నమస్కారం చేయాలి. ఎందుకంటే, వయసులో మీరు నాకంటే ఎలాగూ చిన్నవాళ్ళే; అంతేకాక శక్తిలోనూ నాకంటే బలహీనులే! ఎవరి శక్తి

యుక్తులను వాళ్ళు గ్రహించి, బలవంతులతో మర్యాదగా మసలుకోవాలి" అనేది.




చిన్న మొక్కలు నవ్వి "వయసులో చిన్న అంటే ఒప్పుకుంటాం గాని, వేరే రకంగా మేము నీకంటే ఏమీ తక్కువ కాదు. ఎవరి గొప్పదనం వారికి ఉంటుంది. అయినా అడిగి చేయించుకొనే నమస్కారమూ ఒక నమస్కారమా? మేము నీకు తలొంచేది లేదు" అని వాదించేవి.

మర్రి చెట్టుకి కోపం వచ్చేసేది. గబగబా తన కొమ్మల్ని ఊపి ఓ మోస్తరు గాలిని తెప్పించేది. ఆ మాత్రం గాలికే చిన్న మొక్కలు అన్నీ వణికిపోయి తలలు వంచేవి. అది చూసి మర్రి చెట్టు పెద్దగా నవ్వి, "నేను పుట్టించే ఇంత చిన్న గాలికే నిలబడలేకపోయారు మీరు. ఇప్పుడు ఏం చేసారో- తలవంచలేదు కాబోలు!" అని ఈసడించేది.

గడ్డి మొక్కలు కూడా తగ్గక, "అయ్యో! మేము తలలు వంచింది నీకు కాదు- గాలికి! గాలి పట్ల గల భక్తితో తలలు వంచాం, నువ్వు కూడా గాలి దేవుడికి నమస్కరించు! నీ కొమ్మలు వంచి పలకరించు. ఆయన ఆగ్రహానికి గురి అయ్యావంటే తట్టుకోలేవు" అనేవి.

"నేను పుట్టించే గాలిని గురించి నాకు చెబుతారా, మీరు! ఊరుకోండి! చిన్న ప్రాణులు చిన్నగా ఉండండి చాలు!" అని ఎగతాళి చేసేది మర్రిచెట్టు.

అంతలోనే ఒకసారి పెద్ద తుఫాను మొదలైంది. ఎన్నడూ కనీ వినీ ఎరుగతనంత వేగంగా గాలులు వీచాయి. చిన్న చిన్న మొక్కలన్నీ అల్లాడిపోయాయి. "వంగండి! మరింత వంగండి!" అని ఒకదానితో ఒకటి

చెప్పుకున్నాయి.




ఎగతాళిగా నవ్విన మర్రిచెట్టు తన కొమ్మల్ని అన్నిటినీ బిగబట్టుకొని గాలికి ఎదురొడ్డి నిలబడింది. అది ఎంత గట్టిగా నిలబడిందో, గాలి అంత బలంగా నెట్టింది దాన్ని. చూస్తూ చూస్తూండగానే అది కూకటి వ్రేళ్లతో సహా పెకలి పోటెత్తిన నదిలో పడి, అలానే కొట్టుకుపోయింది.

ఒదిగిన మొక్కలు తుపాను తర్వాత తిరిగి నిలబడ్డాయి. పొగరెత్తిన మర్రిచెట్టు మటుకు పూర్తిగా కనుమరుగైంది. 

**పిడుగు!**

టీచర్: రాముా! నువ్వూ, గోపీ ఇద్దరూ లెక్కల్లో ఒకే తప్పులు చేశారేంటి? ఇదెలా సాధ్యం?!

రాము: మా ఇద్దరికీ లెక్కలు చెప్పింది ఒకరే కద, టీచర్? అందుకనే అలా.

**లోకం తెలీని పక్షి!**

తల్లి: బిట్టూ! ఎప్పుడూ నిజాలే చెప్పాలమ్మా. అబద్దాలు ఆడకూడదు.

బిట్టు: మరి నువ్వేంటి? పక్కింటి ఆంటీ 'కప్పుడు పంచదార' అని అడిగితే ఉండి కూడా లేదని చెబుతావు?

**కొత్త పద్ధతి!**

సువర్ణ: పొద్దున్నుంచి ఆటలే ఆడతున్నావు. వచ్చి హోం వర్క్ చేసుకో.



రాజు: ఇది కూడా హోం వర్కే అమ్మా; మా డ్రిల్ మాష్టరు ఇచ్చారు!



# మాయ మగ్గం కథ

మూలం: ఉజ్రమ్మ, మల్హా, హైదరాబాదు
అనువాదం: నారాయణ, కొత్తపల్లి.



అనగనగా, మిగతాదేశాలన్నిటికీ చాలా దూరంగా ఉన్న ఓ దేశంలో, చాలా చాలా ముసలి నేతగాడు ఒకాయన ఉండేవాడు. మామూలుగా ఎవరైనా సరే, బట్టలు నేసారంటే వాళ్ళు దగ్గర లెక్కలేనంత ఆరోగ్యం, సంపద, జ్ఞానం- మూడూ పోగుపడతాయని చెప్పుకుంటారు అందరూ. ఈయన దగ్గర మరి అవి ఎన్ని ఉన్నాయో తెలీదు గాని, ఆయన మాత్రం అసలు ఎవ్వరికీ అంత సులభంగా దొరికేవాడు కాదు. అంతే కాదు, ఆ ముసలాయన తను నేసిన బట్టని ఎవ్వరికీ అమ్మేవాడు కాదు- తనకు తోచిన వాళ్లకి ఆ బట్టని ఊరికే ఇచ్చేసేవాడు. తనకు నచ్చితే తప్ప, ఎవరికంటే వాళ్లకి

అస్సలు ఇచ్చేవాడు కాదు.

ఆయన అసలు ఆ బట్టల్ని నేసేందుకు దారం ఎక్కడినుండి తెస్తాడో ఎవ్వరికీ తెలియదు; అట్లాంటి మాయ దారాన్ని ఏ మాయ మగ్గం మీద, ఎట్లా నేస్తాడో కూడా ఎవ్వరికీ తెలీదు.




అసలు ఆయన దగ్గరికి ఆ మాయమగ్గం ఎట్లా వచ్చిందో, అంత చక్కని బట్ట నేసేలా అంత గొప్ప మగ్గాన్ని ఎవ్వరు తయారు చేసారో, మరి అట్లాంటి మగ్గం వేరే ఎవ్వరి దగ్గరా ఎందుకు లేదో కూడా ఎవ్వరికీ తెలీదు!

తను అంతగా నేసిన బట్టని తమకు ఏ కొంచెమైనా ఇస్తాడేమో అన్న ఆశకొద్దీ, ఎన్నో దూర దేశాలనుండి కూడా జనాలు, ఎన్నెన్నో శ్రమలకోర్చి, అతన్ని కనుక్కునేందుకు ప్రయత్నించేవాళ్ళు- వాళ్లంతా తమ అదృష్టాన్ని పరీక్షించుకునే వాళ్ళే!

ఎందుకంటే, మరి అతని చిరునామా ఏ మ్యాపులో కూడా దొరకదు! విమానాలు అతనుండే చోటుకు చేర్చవు, పడవలు- ఓడలు పోవు, బళ్ళూ మోటార్లూ నడవ్వు. అట్లా అతనికోసం వెతికేవాళ్ళు కూడా, చాలామంది అలసిపోయి, సడలిపోయి మధ్యలోనే తమ ప్రయత్నాలనుండి విరమించుకునేసారు.

అయినా బాగా పట్టుదల ఉన్నవాళ్ళు మటుకు కొందరు అప్పుడప్పుడూ అతన్ని చేరుకున్నారు- కానీ ఏం లాభం? ఆ ముసలాయన తను నేసిన బట్టని వాళ్లకు అసలు ఇస్తాడో, ఇవ్వడో- అంతా ఆయన ఇష్టమే!

అయితే ఎవ్వరికీ తెలీని ఆ రహస్యం నాకు ఒక్కదానికే తెలుసు: మాయ మగ్గపు

రహస్యం, మంత్రాల బట్టని నేసే ఆ ముసలి నేతగాడి రహస్యం! నేనిప్పుడు మీకు చెప్పబోయేది ఆ కథే:

ఈ భూమి పుట్టిన కొత్తల్లో దీనిమీద అనేక రకాల జీవులు నివసిస్తూ ఉండేవి: చెట్లు, మొక్కలు, జంతువులు, మనుషులు- అన్నీ ఉండేవి, ఇప్పటిలాగానే; అయితే వేరే ఏవో గ్రహాలనుండి- వేరే లోకాలనుండి వచ్చిన వింత ప్రాణులు కూడా కొన్ని ఉండేవి. అవన్నీ కూడా ఇక్కడి మనుషుల రూపాలు ధరించి ఉండేవి. చూసేందుకు అవి అట్లా మనుషుల్లాగా కనబడేవి కానీ, వాటికి చాలా ప్రత్యేకమైన శక్తులు, మహిమలు ఉండేవి. "మనం మనుషులం చెయ్యలేం" అనుకునే చాలా పనుల్ని అవి అలవోకగా చేసేస్తుండేవి.

అయితే ఇట్లా వేరే లోకాలనుండి వచ్చిన ప్రాణులకి, మన భూమి మీద ఉండే మనుషులకు- (నేను మనుషుల్ని 'మామూలు మనుషులు' అనట్లేదు, చూసారా? ఎందుకంటే, నా ఉద్దేశం ప్రకారం అసలు 'మామూలు మనుషులు అంటూ ఎవ్వరూ ఉండరు. ఎవరికి వాళ్లం ప్రత్యేకమైన వాళ్లమే!)

అయితే, ఈ వేరే లోకం నుండి వచ్చిన ప్రాణులకు, మనుషులకు ముఖ్యమైన తేడా ఏంటంటే, వాళ్లు అసలు చెడుని ఏమాత్రం చూడలేరు; ఆలోచించలేరు- కనీసం ఊహించను కూడా లేరు! వాళ్లలోపల ఉన్నదంతా పూర్తిగా కేవలం మంచితనమే.

పుట్టుకతోటే వాళ్ళు అట్లా తయారయి ఉన్నారు- మంచితనం అనేది వాళ్ళు కావాలని ఎంచుకొని అలవరచుకున్న సంగతి కాదన్న మాట! అందుకనే వాళ్లకు తమ ఈ మంచితనం ఒక పెద్ద పరిమితి గానూ, అవరోధం గానూ అనిపించేది- "ఎవరో తమ మీదికి ఇట్లా మంచితనాన్ని రుద్దటం ఏమిటి- అది కూడా తమని అడక్కుండా, చెప్పా పెట్టకుండా?!" అనిపించేది!

అందుకని వాళ్లకి మనుషులంటే చాలా గౌరవం ఉండేది: 'వీళ్ళైతే ఏ పని చేయాలన్నా- చిన్నదైనా సరే, పెద్దదైనా సరే- ఎంచక్కా మంచినో-చెడునో; తమకు

కావలసినదాన్ని తాము ఎంచుకోవచ్చు!' అని ముచ్చటగా కూడా ఉండేది.

ఎవరైనా మనుషులు ఇట్లా మంచి, చెడులని గమనించుకొని, మంచి వైపుకు మొగ్గుతూ నిర్ణయాలు తీసుకుంటుంటే, అలాంటి సమయాల్లో వాళ్ళు ఆ మనుషులకు దగ్గరగా ఉండేందుకు ప్రయత్నించేవాళ్ళు.



అట్లా మంచికి అనుగుణంగా నిర్ణయాలు తీసుకునేవాళ్లకు దగ్గరైనప్పుడు, మరి ఎందుకనో, ఈ వేరేలోకం ప్రాణులకు ఒక వింత మెరుపు వచ్చేది. వాళ్ల శరీరాలు వింతగా వెలిగి తమవైన కాంతులు వెదజల్లేవి: సోలార్ బల్బులు వెదజల్లినట్లు.

అయితే ఎప్పుడైనా వాళ్లకు చెడువైపుకు మొగ్గే మనుషులు ఎదురైతే మటుకు, దీనికి వ్యతిరేకంగా జరిగేది- వాళ్ళు నిస్తేజంగా, చీకటిలాగా తేజోవిహీనం అయిపోయేవాళ్లు. చివరికి రెపరెపలాడి క్యాండిళ్ళు మలిగినట్లు, ఆరిపోయేవాళ్ళు.

మనుషులు మంచికంటే చెడుకి ఎక్కువ ప్రాధాన్యతనివ్వటం వల్ల, వీళ్లకు ఇంకా చాలా ఇబ్బందులు ఎదురైనాయి. ఎక్కువ ఎక్కువ మంది మనుషులు చెడువైపుకు మొగ్గు చూపుతున్నకొద్దీ, మంచిని వదిలేస్తున్నకొద్దీ, ప్రపంచంలో కూడా అంతా చీకటి నిండుకోసాగింది. పుట్టినప్పుడు ప్రపంచంలో ఉన్నంత వెలుగు ఈమధ్య కనబడట్లేదు అసలు!

అట్లాంటి ప్రాణులలో ఒకటి, మిత్యా. ఆమె- (-అతడు అనాలో, ఏమో మరి?! మిత్య ఆడామెనా, మగవాడా? తెలీదు. ఏదో ఒకటి అనాలి కాబట్టి ఆమె అంటాను)- ఇట్లాంటి అద్భుతమైన జీవుల్లోకెల్లా అద్భుతమైన జీవి. ఆమె వేరే లోకం నుండి అలా మన భూమి మీదికి వచ్చిన మొదటి జీవుల్లో ఒకర్తె- మన

భూమి మీద తిరుగాడుతూ, భూమి మీద ఉండే గాలిలో ఎగురుతూ, భూమి ఉపరితలంలో ప్రవహించే నదీనదాల్లోనూ, అవన్నీ చేరుకునే సముద్రాలలోనూ ఈదులాడుతూ, అనేక మానవ జీవన ప్రమాణాల్ని చూస్తూ గడిపింది ఆమె.

ఆమె 'అద్భుతాల్లోకెల్లా అద్భుతం' అని ఊరికే ఇట్లా తిరుగాడినందుకో, లేక ఇట్లా లెక్కలేనన్ని రూపాలను ధరించినందుకో అనలేదు- ఎందుకంటే ఇట్లా వేరే లోకాలనుండి వచ్చిన ప్రాణుల్లో చాలా వాటికి ఇవి రెండూ ఇష్టమే, అవన్నీ కూడా ఇట్లా బాగా తిరుగాడాయి; వివిధ రూపాలను ధరించాయి.

మిత్య అద్భుతమైంది అని ఎందుకన్నానంటే, ఆమెకు తన సహచరులందరికంటే మానవ జాతి పట్ల అమితమైన శ్రద్ధ ఉండింది కాబట్టి. తను గమనించిన అనేక ప్రత్యేక సందర్భాలను ఆధారంగా చేసుకొని ఆమె మానవ జాతి గురించి నిరంతరం ఆలోచించేది, ఆశ్చర్యపోయేది, కంగారు పడేది!

"ఈ మనుషులు ఇంతమంది ఎందుకు, మంచి కంటే అధికంగా చెడునే ఎంపిక చేసుకుంటారు?" అని ఆమె తనని తాను ప్రశ్నించుకుంటూ ఉండేది.

మిత్యకు ఉన్నది అపారమైన శక్తి. తను అనేక యుగాలుగా మానవజాతిని గమనిస్తూ ఉంది. ఇట్లా పదివేల సంవత్సరాల మొత్తాలు పదివేలన్ని- అన్ని సంవత్సరాలుగా మనుషుల గురించి ఆలోచించి, ఆశ్చర్యపోయి, కంగారు పడ్డ తర్వాత మిత్య ఒక నిశ్చయానికి వచ్చింది: 'తను, తన తోటి వేరేలోకపు జీవులు ఇకపైన అట్లా ఊరికే ప్రక్కన నిలబడి, మనుషులు తప్పుడు నిర్ణయాలు తీసుకుంటుంటే చూస్తూ ఊరుకోకూడదు.

వాళ్ళు చెడుని కాకుండా మంచిని ఎంపిక చేసుకునేట్లు తమలాంటి వేరేలోకపు జీవులు ముందుకొచ్చి, చొరవ తీసుకొని సహాయ పడాల్సిందే. దీన్ని ఎట్లా చేయాలబ్బా?!" అని తగిన దారులు వెతకటం మొదలు పెట్టింది.

తను ఏ ఏ దారుల్లో ప్రయత్నించిందో చెప్పటం మొదలుపెట్టానంటే ఇక ఈ కథ

ఎంతకీ ముగియదు: మనుషులు ఇష్టపడే మాజిక్ వంటలు చేసింది తను: 'వాటిని తింటే మనుషులు చెడుకి బదులు మంచిని ఎంచుకుంటారు!' అని.

ఐతే మనుషులకు ఆ తిండి నచ్చలేదు. అందరూ ఆ తిండిలో ఏదో ఒక తప్పు వెతకటం మొదలెట్టారు: ఒకరేమో "అందులో ఉప్పు చాలా ఎక్కువైంది" అన్నారు. ఒకరొచ్చి "ఉప్పు సరిపోలేదు!" అన్నారు. ఒకరు "చాలా గట్టిగా ఉన్నై" అంటే, వెంటనే మరొకరు "లేదు లేదు- ఇవి మరీ మెత్తగా ఉన్నై" అన్నారు. దాంతో చివరికి మిత్య మ్యాజిక్ వంటల పనిని ఎత్తి పెట్టేసింది.

తర్వాత మిత్య పుస్తకాలు తయారు చేద్దామనుకున్నది: "ఆ పుస్తకాల్లో కథలుంటాయి! మనుషులు చెడుకు బదులు మంచిని ఎందుకు ఎంచుకోవాలో చెబుతాయి ఆ కథలు!" అనుకున్నది. తను ఇంక అట్లాంటి పుస్తకాల్ని ఎన్నంటే అన్ని తయారు చేసి, వాటినన్నిటినీ చక్కని అలమారలలో పెట్టి, ఆ అలమారలన్నిట్నీ కలిపి మంచి లైబ్రరీలుగా తయారు చేసింది.



ఐతే ఆ పుస్తకాల్ని ఎవ్వరూ చదవలేదు! చూస్తూండగానే అవన్నీ దుమ్ము కొట్టుకొని పోయాయి. ఆ లైబ్రరీల్లో సాలీళ్ళు గూళ్ళు కట్టాయి. ఒక ఐదువందల ఏళ్ళు ఇట్లా గడిచేసరికి తను సంపాదించి పెట్టిన ఆ పుస్తకాలన్నీ రాలి, పొడి ఐపోయి, దుమ్ములో కలిసిపోయాయి కూడా.

ఆ తర్వాత మిత్య మాజిక్ నీళ్ళు ట్రై చేసింది, మ్యాజిక్ మబ్బులు, మ్యాజిక్ చెప్పులు- ఇట్లా

రకరకాలుగా ప్రయత్నించింది పాపం. అయినా ఏవీ పని చెయ్యలేదు!

చివరికి ఒక రోజున, మిత్యకి ఒక కుర్రవాడు కనబడ్డాడు: బాగా రద్దీగా ఉన్న ఓ వీధిలో నడుచుకుంటూ పోతున్నాడు అతను. అతనిలో మంచితనపు వెలుగు కనబడ్డది మిత్యకి.




అతను నడుస్తున్న తీరు కూడా మిగతావాళ్లతో పోలిస్తే చాలా భిన్నంగా ఉంది. చూస్తే ఇది బాగా నడవటం వచ్చినవాళ్ల నడకలాగానే లేదు! ఎప్పుడూ కూర్చొని ఉండేవాళ్లెవరో ఒక్కసారిగా నడుస్తున్నట్లుంది అతను నడిచే పద్ధతి.

"ఎవరితను?" అనుకుంటూ అతనివైపు నడిచింది మిత్య. అతనికి దగ్గరైనకొద్దీ తన శరీరం కూడా ఇంకా ఇంకా కాంతివంతంగా మెరవ సాగింది!

"నమస్కారం!" అన్నది మిత్య అతని దగ్గరకు వెళ్ళి.

"నమస్తే!" అన్నాడా యువకుడు చిరునవ్వుతో- "చెప్పండి, నేను మీకు ఏం సాయం చెయగలను?"

"మీరు ఏం పని చేస్తుంటారు?" అడిగింది మిత్య.

"నేను బట్టలు నేస్తాను" చెప్పాడు జమాల్- అదీ, అతని పేరు! అట్లా తన కథ తెలిసింది మిత్యకి. అతను రోజంతా మగ్గం మీదే కూర్చొని పని చేస్తాడు- అందుకనే అతని నడక ఆ విధంగా వంకరగా అయ్యింది.

అతను బట్టలు నేసి, దాన్ని అమ్ముకొని, అట్లా వచ్చిన డబ్బులతో ఇంట్లో ఉండే ముసలివాళ్ళని, చిన్న పిల్లల్ని సాకుతాడు. అంతా పోగా మిగిలిందేదో తన ఖర్చులకు

వస్తుంది.

“కానీ నాకో కల ఉంది" చెప్పాడు జమాల్- "నేను నేసిన బట్టని జనాలకి ఊరికే ఇచ్చెయ్యాలి- అస్సలు అమ్మకూడదు అని.”

“ఎందుకు?”

"ఎందుకంటే అట్లా ఊరికే ఇస్తే నాకు చాలా సంతోషంగా ఉంటుంది. బట్టని డబ్బులకి అమ్మినప్పుడల్లా ఎందుకనో నాకు చాలా విచారం వేస్తుంది"

అతను చెప్పిన ఈ మాటలు వింటున్నకొద్దీ మిత్య ఇంకా ఇంకా ధగధగా మెరిసిపోయింది.

ఇంక నేను మీకేమీ చెప్పనవసరం లేదు: మిత్య జమాల్ కోసం మాయ మగ్గం ఎలా చేసిందో, ఎప్పుడూ తనకి అందుబాటులో ఉండేలా మాయ దారాన్ని ఎలా తయారు చేసిపెట్టిందో!

దాంతో ఇక అతను ఎప్పటికీ తను నేసిన బట్టను ఇక ఎవ్వరికీ అమ్మవలసిన పనే లేదు! తనకి ఎవరు నచ్చితే వాళ్లకి- తనని, తన బట్టని ఎవరు చాలా ఇష్టపడితే వాళ్లకి- ఇచ్చేయచ్చు!



వాళ్ళు అతనికీ అతని కుటుంబపు అవసరాలన్నిటికీ కావలసిన వస్తువుల్ని- ఆహార పదార్థాలు, ఇంకేవైనా సరే- అన్నిటినీ- ఇస్తూంటారు! ఆ విధంగా మిగిలినవాళ్లకూ మంచి ఎంపిక చేసుకోవటం అలవడుతుంది! అట్లాంటివాళ్లు ఎక్కువైన కొద్దీ, మిత్యకి మరింత సంతోషం!

మిత్య ఒక్కటే షరతు పెట్టింది- ఈ మాయమగ్గం తన దగ్గరికి ఎట్లా వచ్చిందో మటుకు జమాల్ ఎవ్వరికీ చెప్పకూడదు. అందుకనే కదా, నేను చెప్పేవరకూ మీక్కూడా ఎవ్వరికీ ఈ కథ తెలీనిది?!

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**ఇంటర్నెట్‌లో, ఉచితంగా, నీతిచంద్రిక, నెమలి, రామచిలుకలు, పంజరం, గర్వం, బంగారుగొలుసు, చీకటి, పరిరక్షణ, కడుపునొప్పి, రాక్షసుడు, మాట్లాడేఒంటె, పట్టుబడినదొంగ, మామిడికాయ, భారతదేశం, చెరువు, ఆకలి, సబ్బులు, నన్నారి:** పై పదాలు ఈ క్రింది పట్టికలో దాగున్నాయి- నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రిందినుండి పైకి- ఎటుపడితే అటు! వాటిని వెతికి వాటి చుట్టూ గుండ్రాలు గీయండి!

| నె | చి | ప | ట్టు | బ | డి | న | దొం | గ | నీ | చె | ప |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మ | ర | క | గ | ర్వం | తి | సు | లు | గొ | రు | గా | బం |
| లి | గా | ఆ | డు | చం | న | న్నా | రి | రం | ఉ | కా | మా |
| మి | కా | సు | వు | శం | బ | లి | రా | చీ | చి | లు | ఒం |
| య | క్ష | రు | దే | లో | ట | మ | ప్పి | భా | తం | రి | నీ |
| రా | జ | త | ట్ | డి | చి | క | నొ | ఆ | గా | తి | ణ |
| ది | ర | ర్నె | మి | లు | గ | రి | పు | ప | చం | లు | క్ష |
| భా | ట | లు | క | ఆ | ణ | లి | డు | ద్రి | ణ | నె | ర |
| ఇం | వు | లు | నె | గ | లు | టి | క | చీ | టి | ఒం | రి |
| నె | చె | క | రం | జ | పం | తి | ణ | ఆ | స | మా | ప |
| మా | మి | ది | కా | య | వు | లు | వు | రు | చె | దే | నీ |
| తి | లు | బ్బు | స | ట | క | ర్నె | టె | ఒం | డే | ట్లా | మా |

# పదరంగం-101

*నిర్వహణ: డా. సిరి, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం*

| 1 | | 2 | | 3 | ★ |
|---|---|---|---|---|---|
| | ★ | | ★ | 4 | 5 |
| 6 | | ★ | 7 | ★ | |
| | ★ | 8 | | | ★ |
| 9 | 10 | | | ★ | 11 |
| ★ | | ★ | 12 | | |

**నిలువు:**

1. అమరావతి రాజధానిగా ఉన్న రాష్ట్రం (5)
2. 'వెంట్రుక!' (2)
3. సైకిల్ లాగా తొక్కే మూడు చక్రాల బండి (2)
5. 'వర్ణం' మరోలా (2)
7. మనకు తరచూ కనిపించే ఒక ఎడారి మొక్క (4)
8. తిరగబడిన 'గ్లాసు'(2)
10. country తెలుగులో (2)
11. 'శరము' అంటే? (2)

**అడ్డం:**

1. టంగుటూరి ప్రకాశం పంతులుగారిని ఇలా పిలుస్తారు (5)
4. 'ఆమ్లం' కి వ్యతిరేకమైనది (2)
6. సమాధానం కాదు! మరి? (2)
8. 'ఈజీ' తెలుగులో (3)
9. అటునుండి వచ్చిన "బంగ్లాదేశ్' (4)
12. దిక్కులలో ఒకటి (3)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి.

సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి - 103 ని బహుమతిగా పంపిస్తాం!

మా చిరునామా: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101

**కొత్తపల్లి** ప్రింటు పుస్తకాలను ఆన్‌లైన్లో ఆర్డరు చేయటం, చందాలు కట్టటం చాలా సులువు! క్రెడిట్ కార్డుల ద్వారాను, డెబిట్ కార్డుల ద్వారాను, నెట్ బ్యాంకింగ్ ద్వారా కూడా కొత్తపల్లికి డబ్బులు చెల్లించవచ్చు! అక్కౌంటు నెంబర్లు వెతుక్కునే పని కూడా లేదు! సందర్శించండి: **http://www.instamojo.com/kottapalli**



**కొత్తపల్లిని మీ మిత్రులకు, మీరు చదివిన బడులకు, మీ సమీపంలోని లైబ్రరీలకు బహూకరించండి!**

కథల పుస్తకాలండీ కథల పుస్తకాలు! పిల్లలు చెప్పిన కథలున్నాయ్! పెద్దలు వ్రాసిన కథలున్నాయ్!

రంగురంగుల బొమ్మలున్నాయ్! అక్కడక్కడా జోకులున్నాయ్!

ఆన్‌లైన్‌లో దొరుకుతున్నాయ్! ఇప్పుడే కొనండి! అందరికీ చెప్పండి!!!



**రాబోయే 12 సంచికలకై ముందస్తు చందా:**

**రూ. 360/-** (పోస్టేజీ మరియు యస్సెమ్మెస్ ఛార్జీలు కలిపి)

గమనిక: అచ్చయిన పుస్తకాలు ఎప్పటికప్పుడు సాధారణ పోస్టులో పంపబడతాయి.

NEFT TRANSFER కోసం:

"Kottapalli Prachuranalu"
SB A/c 62320333310,
State Bank of India
Dharmavaram Branch
IFSC: SBIN0020902

(బ్యాంకు వారి నియమాలననుసరించి, "క్యాష్ హ్యాండ్లింగ్ చార్జీలు"గా ప్రతిసారీ రూ. 50 అదనంగా చెల్లించవలసి వస్తున్నది.. అందువల్ల బ్యాంకులో డబ్బు కట్టకండి- నేరుగా మీ అక్కౌంటు నుండే ట్రాన్సుఫర్ చేయగలరని ప్రార్థన)

ప్రస్తుతం అందుబాటులో ఉన్న కొత్తపల్లి ప్రింటు పుస్తకాల వివరాలు:

| క్రమ సంఖ్య | వివరాలు | ఒక సెట్ లోని పుస్తకాల సంఖ్య | స్టాకులో ఉన్న సెట్లు (సుమారుగా) | వెల (రూ) **(పోస్టేజి అదనం)** |
|---|---|---|---|---|
| 1 | 2011 Set | 1 | 500 | 20 |
| 2 | 2012 Set | 8 | 10 | 160 |
| 3 | 2013 Set | 3 | 76 | 75 |
| 4 | 2014 Set | 10 | 314 | 250 |
| 5 | 2015 Set | 7 | 753 | 175 |
| 6 | 2016 Set | 8 | 905 | 200 |
| 7 | 2017 Set | 7 | 1202 | 175 |

మరిన్ని వివరాలకై సంప్రతించండి: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా, 515101. ఫోను: 7702877670, 9490180695. ఇ-మెయిలు : team@kottapalli.in

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 05/10/2018 Postal Regn No: HDP/008/2018-2020

## మార్కులా, కథలా?

సుబ్బారావు వచ్చాడు "ఇదిగో, ప్రపంచమంతా 'ర్యాంకులు కావాలి, మార్కులు కావాలి' అని తన్నుకులాడుతుంటే, మీరు ఇట్లా 'కథలు, జోకులు, పాటలు' అని పంతం పట్టుకొని కూర్చోటం బాలేదు" అంటూ.

నేను నవ్వాను. "గుర్తుపట్టావే, మొత్తానికి?!" అన్నాను.

"ఆ మాత్రం తెలుస్తూనే ఉందిలే. అయినా మీ కొత్తపల్లి వాళ్లకి చదువులు కావాలా-అక్కర్లేదా, ముందు ఆ సంగతి తేల్చు, ఇవాళ్ల" అన్నాడు సుబ్బారావు కూర్చుంటూ.

"చూడు సుబ్బారావూ, అర్థం చేసుకో: కథల్లో మనసుకి హాయినిచ్చే గుణం ఉంటుంది. అవి పిల్లల్ని నవ్విస్తాయి; వాళ్లని మెచ్చుకుంటాయి; వాళ్లకు రకరకాల సంగతులు నేర్పిస్తాయి; ఎట్లా ఉంటే మంచిదో చెబుతాయి; జీవితం పట్ల ఆశనీ, భవిష్యత్తు పట్ల ఉత్సాహాన్నీ కలిగిస్తాయి. అట్లాంటివి చదవకపోతే, పిల్లలు తొందరగా ముసలివాళ్ళు అయిపోతారు. నవ్వటం, సంతోషపడటం మరచిపోతారు. నిరాశావాదులు అయిపోతారు. అది ఏం మేలు, చెప్పు?" అన్నాను అనునయంగా.

"అవునులే, రోజంతా పనిచేసాక ఓ కథ చదివితే నాకు కూడా ప్రాణం లేచివచ్చినట్లనిపిస్తుంది. అయినా చదువుకోవాల్సిన పిల్లలు వీటిలో పడితే వాళ్లకి టైం వేస్టు కాదూ?"

"ఇరవై నాలుగు గంటలూ పని చేస్తే ఇంజన్లు వేడెక్కిపోతాయిరా బాబూ! మెదడుల పనితీరుని అర్థం చేసుకోవాలి; వాటికి సేదతీరే సమయం దొరికేట్లు చేయాలి. రిలాక్స్ అయిన మెదళ్లే కదా అద్భుతాలు సృష్టించేది?! ఆట పాటలు, కళలు, సాహిత్యం- ఇవన్నీ మనసుని చల్లబరుస్తాయి. క్రొత్త ఊపిరి పోసి, అంతరంగాల్ని ప్రాణశక్తితో నింపుతాయి"

“నువ్వు ఏదేదో చెబుతావు- అంతేలే" అన్నాడు సుబ్బారావు నిస్సహాయంగా.

"ఇదిగో, నువ్వు నసుగుతూనే ఉంటావుగానీ.. ఇదొక్కటీ చెప్పు- మీవాడి ముఖం కొత్తపల్లిని చూడగానే వెలుగుతుందా, లేదా?" చివరి అస్త్రం ప్రయోగించాను నేను.

కొడుకు ముఖం గుర్తుకొచ్చిన సుబ్బారావు సంతోషంగా నవ్వాడు.

“Kottapalli” Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.